# వీరేశలింగం

•సంక్షిప్త జీవిత చరిత్ర•

పిల్లలూ, పెద్దలూ తప్పక
చదవాల్సిన పుస్తకం.

డా॥ అక్కిరాజు రమాపతిరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**VERESALINGAM JEEVITHA CHARITHRA**
By Dr. Akkiraju Ramapathi Rao

ప్రచురణ నెం. : [illegible]

ప్రతులు : 1000
గత ముద్రణలు : 1992, 1994, 1999,
నాల్గవ ముద్రణ : జూలై, 2009



**వెల : రూ.25**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్ - 001.
ఫోన్: 24744580/24735905
E-mail : visalaandhraph@yahoo.com
WWW.visalandra.vcomnet.co.in
**[illegible]**
అబిడ్స్ & సుల్తాన్‌బజార్ - హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, అనంతపురం, కరీంనగర్, తిరుపతి, గుంటూరు, హన్మకొండ, కాకినాడ, ఒంగోలు, శ్రీకాకుళం.



ముద్రణ : **శ్రీకళాంజలి గ్రాఫిక్స్**, హైదరాబాద్ - 29. ఫోన్: [illegible]

# నివేదిక

వీరేశలింగం పంతులుగారి కృషివల్ల తెలుగువాళ్ళలో సామాజిక సాహిత్య రంగాలలో ఒక నూతన దృక్పథం ఏర్పడింది. వారి అభిరుచులలో కొత్త మార్పులు కలిగాయి. సంప్రదాయంలోని మంచిని చెడునూ వారు విశ్లేషించి చూడగలిగారు. సాహిత్యంలో ఆయన తెచ్చిన ప్రక్రియా వైవిధ్యంవల్ల ఎందరో కొత్త రచయితలు బయలుదేరారు. తెలుగు సాహిత్యానికి అపూర్వమైన వికాసం కలిగింది.

ఆనాడు సంఘంలో పాతుకొనిపోయిన చెడుగులనుంచి ప్రజలను రక్షించాలని వీరేశలింగం పంతులుగారు నయాన భయాన తెలుగువారికి బోధించారు.

వీరేశలింగం జీవించిన డెబ్బైఒక్క సంవత్సరాలలో ఏభై సంవత్సరాల కాలం నిర్విరామంగా ఆయన సాహిత్యకృషీ, సమాజోద్ధరణమూ కూడా చేశాడు. నూటికిపైగా గ్రంథాలు రచించాడు. ఎన్నో పాఠశాలలు నెలకొల్పాడు. చిన్నతనంలోనే వితంతువులైన బాలికలకు పునర్వివాహం చేయటానికి పూనుకొని అది సాధ్యమేనని నిరూపించాడు. తెలుగుదేశంలో విద్యా సంస్థలలో బాలబాలికల సహ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టాడు. అణగారిన వర్గాల వారిని ఆదుకొని వారికి తన విద్యా సంస్థలలో ఉచిత విద్యా ప్రధానం గావించాడు. ప్రజలు తమ సమస్యలను సాముదాయికంగా చర్చించడానికి, సమావేశాలు జరపడానికి అనువైన పురమందిర నిర్మాణం ఆయనవల్లనే రాజమండ్రిలో తొలిసారి రూపుదిద్దుకొంది.

పురపాలక సంఘంలో సభ్యుడై పౌరహితం కోసం ఆయన శ్రమించారు. స్వీయచరిత్ర, కవులచరిత్ర వంటి గొప్ప గ్రంథాలను ఆయన తెలుగువారికిచ్చారు. సాంఘిక చైతన్యం కలిగిస్తే తక్కిన రంగాలలో ప్రజలు పురోభివృద్ధిని సాధిస్తారని ఆయన విశ్వాసం. తన కృషినంతా ఆ లక్ష్యసాధనకే ఆయన కేంద్రీకరించాడు. వీరేశలింగం మహాశయుని జీవితచరిత్రను సంక్షేపంగా, 8 ప్రకరణాలుగా చెప్పాను. ఈనాటి యువతరం ఈ ప్రయత్నం హర్షించాలని నా కోరిక.

**–అక్కిరాజు రమాపతిరావు**

వీరేశలింగం – జననం : 16.4.1848 ∗ మరణం : 27.5.1919

# ఇందులో...





# జననం, బాల్యం, విద్యాభ్యాసం

**ఏనాటిదో గోదావరి!**

**వేదకాలం నాటిది కావచ్చు!!**

కవులూ, పండితులూ, కళాకారులూ, కథానాయకులు, గోదావరీ తీరాన్ని రంగస్థలం చేసుకొన్నారు. కావ్యాలు వ్రాశారు, గళమెత్తి పాడారు. ఆ ఇసుక తిన్నెల్లో, ఆ ఏటి జాలుల్లో, అక్కడి పాఠశాలల్లో వాళ్ళ వ్యక్తిత్వాలు దిద్దుకొన్నారు.

ఏనాటిదో రాజమహేంద్రవరం! భారతీయ నగరాలలో పురాతనమైనదే అయినా, ప్రతిసారీ అధునాతన భావాలను అందించింది. తెలుగుదేశానికి కొత్త చవు లిచ్చింది. కొత్త కవుల నిచ్చింది.

రాజరాజ నరేంద్రుడు భారత రచనకు శ్రీకారం చుట్టించాడు నన్నయ్య చేత. తొమ్మిది వందల ఏళ్ళు, కావ్య మార్గం, గోదావరిలా అవిచ్ఛిన్నంగా సాగుతూ వచ్చింది. మళ్ళీ గోదావరి ఒడ్డుననే వీరేశలింగం జన్మించాడు. తెలుగు సాహిత్యానికి కొత్త వరవళ్ళు దిద్దాడు. గోదావరి కొత్త పరవళ్ళు పోయినట్లుగా, కొత్త రూపురేఖలు సంతరించాడు. తెలుగుజాతి తల ఎత్తుకొనేట్లు చేశాడు.

కందుకూరి చంద్రమౌళిగారని ఒక సంపన్న గృహస్థు. వాళ్ళది ఏలూరు. ఆయన పుట్టి, పెరిగి పెద్దవాడైనదాకా, ఆ కుటుంబం వాళ్ళది 'వెర్రిశైవం', ఆ శైవం బాగా ముదిరిపోయిందికూడా. అయితే చంద్రమౌళిగారు నిలువుబొట్టు వాళ్ళ పిల్లను పెళ్ళి చేసుకొన్నాడు, తాను అడ్డబొట్టు వాడైననూ. ఈ చంద్రమౌళిగారికి కొడుకు పుట్టాడు. తరతరాలనుంచి శైవ సాంప్రదాయమే కాబట్టి, ఆ కొడుక్కు వీరేశలింగమని పేరు పెట్టాడు. ఈ వీరేశలింగం గొప్ప వ్యవహర్త, చాలా తెలివికలవాడు. గొప్ప గొప్ప ఉద్యోగాలు చేశాడు. ఉద్యోగరీత్యా ఆయన ఏలూరు వదిలిపెట్టి రాజమండ్రి చేరుకొన్నాడు. లంకంత ఇల్లు కట్టాడు. ఆయన మెళ్ళోని లింగకాయను తీసివేశాడు. వీరశైవులంతా మెడలో లింగకాయలు కట్టుకొనేది వాడుక. మోత బరువు తప్పింది. మేనమామలు నిలువుబొట్లు వాళ్ళాయె! తల్లి ప్రోత్సాహమో, మామయ్యలు చెప్పారో - కుటుంబంలో సంస్కరణ దృష్టి ప్రారంభమైంది.

ఈ వీరేశలింగం గారికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు వెంకటరత్నం, రెండో అతను సుబ్బారాయుడు. వీరేశలింగం చాలా డబ్బు సంపాదించాడు. గొప్ప కీర్తి సంపాదించాడు. అయినా చూడలేని వాళ్ళ చాడీలవల్ల ఉద్యోగం పోగొట్టుకున్నాడు. పెద్దకొడుక్కు పెళ్ళి చేశాడు. కోడలు కాపరానికి రాకుండానే కాలం చేసింది. ఆడపిల్లను కని ప్రేమాస్పదురాలైన తోబుట్టువు కన్ను మూసింది. ఎన్నో కష్టాలు. ఆయన కన్ను మూశాడు. ఆయన తల్లి అక్కమ్మగారు బ్రతికే ఉన్నది. భార్య కావమ్మగారు బ్రతికిఉంది. వీరేశలింగంగారు వెళ్ళిపోయినారు. చింత చచ్చినా పులుపు చావలేదు. పూలమ్మినచోట

కట్టెలమ్మటానికి ఇష్టపడలేదు అన్నదమ్ములు. స్థిరచరాస్తులమ్ముకొన్నారు కొన్నాళ్ళు. అస్తులనే నమ్ముకొన్నారు.

సిరి వచ్చినా చిన్నెలు చావలేదు. కాని ఎన్నాళ్ళు? అన్నదమ్ములు ఉద్యోగ ప్రయత్నాలు చేశారు. చిన్నవాడు సుబ్బారాయుడికి కాకినాడలో ఉద్యోగం దొరికింది. అంతకుముందే అతడికి పెళ్ళైంది. మేనత్త కూతురినే చేసుకున్నాడు పున్నమ్మను. పున్నమ్మను తాత వీరేశలింగమే పెంచాడు. తల్లిలేని పిల్ల. పరాయిచోట ఇవ్వలేకపోయినాడు. తన చెల్లెలు రాజ్యలక్ష్మి లేనేలేదు. ఎదురు మేనరికం ఎందుకన్నారు. అయినా తన తల్లి పట్టుపట్టింది. తన మనస్సులో పరాయిచోట ఇవ్వగూడదని తపన వుంది. రెండో కొడుకు సుబ్బారాయుడికి వాళ్ళ బంగారాన్ని (పున్నమ్మ) ఇచ్చి పెళ్ళిచేశారు. పున్నమ్మది బలహీనపు పుటక, దయ్యాల భయం ఇంతా అంతా కాదు. తాతగారు ఎందరెందరినో భూతవైద్యులను పిలిపించి వైద్యాలు చేయించాడు. రక్షరేకులు కట్టించాడు. హోమాలు చేయించాడు. అయినా పున్నమ్మను భూతాలు పట్టి పీడిస్తూనే వచ్చాయి.

కీలకనామ సంవత్సరం, చైత్రమాసం, శుద్ధత్రయోదశి ఆదివారం. ప్రాచీదిశాంగన ఫక్కున నవ్వుతున్నది. గోదావరి ఏటి ఇసుకల మల్లెపూల కాంతులవలె తెలిరేకలు తూర్పు దిక్కున రంగవల్లుల్లా మెరుస్తున్నాయి. ప్రత్యూష పవనాంకురాలు పైకొంటున్నాయి ఆరోజు.

1848వ సంవత్సరం, ఏప్రిల్ నెల, 16వ తేది వీరేశలింగమనే అర్భకుడు పుట్టాడు. తాత పుట్టాడని అందరూ సంబరపడ్డారు. ఇంటిల్లిపాదీ మగ నలుసు అని మహదానంద పడ్డారు.

పుట్టినప్పటినుంచీ రోగాలే. పురిట్లోనే ఉబ్బసం. ఆరునెలలైనా నిండకుండానే స్ఫోటకం. ఆశ లేదనుకున్నారు. అంతా ముగిసిందనుకున్నారు. బ్రతికి బట్ట కట్టడనుకున్నారు. కాని బ్రతికాడు - ఎందరి బ్రతుకులో ఉద్ధరించడానికి!

కాకినాడ కాపరం. ఆపదలు చెప్పిరావు. పసివాడు అడుగు లేస్తున్నాడు. మాటలన్నీ వచ్చినై. సుబ్బారాయుడికి ప్రాణాలమీదికి ముంచుకొని వచ్చింది. నాలుగేళ్ళకే తండ్రి లేనివాడయినాడు వీరేశలింగం. రాజమండ్రికి తిరిగి వచ్చేశారు తాతమ్మ, అక్కమ్మగారు, నాయనమ్మ కావమ్మగారు. తల్లి పున్నమ్మ. తండ్రిలేని పసివాడు. ఒట్టి అర్భకం పుటక. అతి గారాబం చేశారు. పెదతండ్రి చంక దించేవాడు కాదు వీరేశలింగాన్ని. ఆయన ఒకరోజు కనపడకపోతే బెంగ పెట్టుకొనేవాడు పసివాడు.

ఏడేళ్లు వచ్చాయి. వడకపోచ వేశారు మెళ్లో. వీధిబడికి పంపించారు. వేణుగోపాలస్వామి ఆలయంలో పులిపాక అమ్మిరాజుగారి బడి. అక్షరాలు నేర్చుకొన్నాడు. గుణింతం కూడబలుక్కొన్నాడు. ఈ పంతులుగారికి తొర్రినోరు. ముక్కుతో మాట్లాడతా డాయన. పెదవి మీద పుట్టినప్పుడే మొర్రి ఉన్నది. వీరేశలింగం అమ్మిరాజుగారి ముక్కుమాటలు నేర్చుకొన్నాడు. ఇంటిదగ్గర పెదనాన్న ముక్కు నలిపేవాడు. ముక్కు మాటలు మాన్పించటానికి ముప్పుతిప్పలు పడ్డారు. తరవాత పిల్లవాణ్ని గూని సోమరాజుగారి బడికి పంపించారు. తిరుమెళ్ళవారి ఇంట్లో ఈయనగారి బడి ఉండేది. ఇక్కడ వీరేశలింగం చదవనూ వ్రాయనూ నేర్చుకొన్నాడు. బాల రామాయణం, అమరం

చదివించాడు పంతులుగారు. రుక్మిణీ కల్యాణం, సుమతీ శతకం, కృష్ణ శతకం, ఆంధ్రనామ సంగ్రహం రోకటిపాటగా వల్లెవేశాడు.

ఇక ఇంతటితో వీధిబడి చదువు పూర్తయింది. తెలుగుచదువు ఇక చాలు. లెక్కా డొక్కా నేర్చుకొంటే, తరువాత ఉద్యోగంలో ప్రవేశించవచ్చు. అందుకని తాలూకా కచేరీలో గుమాస్తాగా పనిచేస్తున్న బంధువొకాయన దగ్గర పని నేర్చుకోవటానికి పంపించారు. ఇక రోజూ తాలూకాఫీసుకుపోయి, అక్కడ పని నేర్చుకొంటూ వచ్చాడు వీరేశలింగం. అట్లా ఏ రెండేళ్లో గడిచాయి.

పొద్దున్నే దూరి సోమయాజులుగారు ఇంటికి వచ్చి సంస్కృతం చెప్పేవారు. మధ్యాహ్నమంతా తాలూకాఫీసులో పని నేర్చుకోవటం, సాయంకాలం పెదనాన్న ఇంగ్లీషు, లెక్కలు నేర్పేవాడు. ఇంతలో కంపెనీవారినుంచి రాణిగారు, భారతదేశ ప్రభుత్వాన్ని తాము తీసుకొన్నారు. ఉద్యోగాలు ఇవ్వటానికి సామాన్యమైనవీ, విశేషమైనవీ కొన్ని పరీక్ష లేర్పాటు చేశారు. అందువల్ల వీరేశలింగాన్ని ఇంగ్లీషు బళ్లో చేర్చారు.

అది 1860వ సంవత్సరం. పన్నెండేళ్ళదాకా విభూతి పెండెకట్లు, బిళ్ళ గోచులు, శివరాత్రి జాగారాలు, ఏకాదశి ఉపవాసాలు, సహస్ర గాయత్రి జపాలు, త్రికాల సంధ్యావందనాలు చూసి 'అబ్బ! పిల్లవాడికి ఎంత నిష్ఠ' అని ఇంట్లోవాళ్ళు సంతోషించారు.

ఇంట్లో ఇంకెవ్వరూ పిల్లలు లేరు. ఆడుకోవటానికి బయటకు పోనిచ్చేవాళ్ళు కారు. ఇల్లు కదలనిచ్చే వాళ్ళు కారు. ఎట్లా పొద్దుపోవాలి? పాఠం ఒక్కసారి చదివితే నోటికి వచ్చేస్తుంది. ఇంట్లో అటకల మీద తాటాకు పుస్తకాలున్నాయి. అవి తీసి చదవటం ప్రారంభించాడు. తెలుగుమీద అభిమానం ఎక్కువైంది. కావ్యాలమీది కాంక్ష పెరిగిపోయింది. మూడో తరగతి చదువుతూ ఉన్నాడు. అప్పుడే కొత్త కావ్యం ఒకటి వచ్చింది. 'సుమనో మనోరంజనం' అని. అది తెచ్చుకొని ఆసాంతం కాగితాలమీద వ్రాసుకొన్నాడు.

ఎవరో అనుకొంటూ వుండగా విన్నాడు – వసు చరిత్ర అద్భుతమైన కావ్యం, దాన్ని మించింది లేదు అని. అది చదవాలన్న తమకం ఎక్కువైంది. తల్లి నడిగాడు కొనిపెట్టమని. దాని ఖరీదు నాలుగు రూపాయలన్నారు. తమ ఇంటికి వచ్చే ఒక నెల అద్దెకన్నా అర్ధరూపాయి ఎక్కువ. తరగతిలో పాఠం చెప్పే పుస్తకం కాకపోతే కొనిపెట్టనన్నది తల్లి. 'తొమ్మిది నెలల బడి జీతం నాలుగున్నర! నేనెక్కడినుంచి తేను!' అన్నది. ఉత్సాహం నీరుకారింది. కాని ఆ పుస్తకం చదవాలన్న తహతహ. బడి జీతం అర్ధరూపాయి ఉన్నది. కానీ, అర్ధణా దాచుకొన్నది అర్ధరూపాయి ఉన్నది దగ్గర. రూపాయికి రాదే వసుచరిత్ర!

వందిరి మహాదేవుడు పుస్తకాల వ్యాపారి. "రూపాయికి నాలుగున్నర పుస్తకం ఇంటికెట్లా ఇస్తాను?" అని ధర్మ సందేహం తీర్చమన్నాడు వీరేశలింగాన్ని. పిల్లవాడి ఉత్సాహం చూసి మెత్తబడ్డాడు. ఒకమాట అన్నాడు, ఒకమాటు ఆ పుస్తకం చూడనివ్వు అంటున్న వీరేశలింగంతో. 'ఆ రూపాయి ఇప్పుడివ్వు; నెలనెలా అర్ధరూపాయి ఇవ్వు. పుస్తకం ఖరీదు చెల్లగానే ఇంటికి ఏకంగా పట్టుకొనిపో. అంతదాకా ఇక్కడే కూచొని చదువు, ఆ వీలు కల్పిస్తాను. అట్లా అయితే ఆ పుస్తకం ఇస్తాను.' వీరేశలింగానికి సంతోషం

కలిగింది. సరేనన్నాడు. బడికి ఎగనామం పెట్టాడు. పుస్తకాల కొట్లో కూచుని వసుచరిత్ర చదవటం మొదలుపెట్టాడు. నెలరోజులు బడికి పోలేదు. తల్లికెవరో చెప్పారు.

"పిచ్చితల్లీ, మీ పిల్లవాడు బడికి పోవటం లేదు."

"ఏం నాయనా, నేను విన్నది నిజమేనా?"

"అవునమ్మా, వాళ్ళు చెప్పింది నిజమే."

నిజం చెప్పినందుకు తల్లి మెచ్చుకొంది. పిల్లవాడి కోర్కెతీర్చనందుకు నొచ్చుకుంది.

"కన్నతండ్రీ! నీక్కావలసిన పుస్తకం కొని తెచ్చుకో. కాని బడి మాత్రం మానవద్దు."

బడికిపోతున్నాడు వీరేశలింగం. ప్రతి తరగతిలోనూ మొట్టమొదటివాడు. అన్ని బహుమానాలు తనవే. సత్ప్రవర్తనకు ప్రథమ బహుమానం. చదువులలో ఫస్టు. అన్నీ వీరేశలింగానికే.

హెన్రీ మారిన్ జిల్లా జడ్జి. పాఠశాలను చూడడానికి వచ్చాడు. మంచి పిల్లవాడెవరు స్కూల్లో 'ఎంచి చెప్పాలి మీరు' అని చీట్లు పంచాడు పిల్లలందరికీ. ఎందరో వీరేశలింగం పేరే వ్రాశారు. సత్ప్రవర్తనకు చక్కని బహుమానం. తరగతిలో ఎప్పుడూ ఫస్టు. ఎన్నో బహుమానాలు వచ్చేవి.

ఇంటి దగ్గర తాటాకు పుస్తకాలు చదివి చదివి, ఋషుల అద్భుత శక్తులు మనసు నాకట్టుకొన్నాయి. తపస్సు చేస్తే గొప్ప శక్తులు కలుగుతాయని, తనకు తెలిసినట్లు నమ్మకంగా పురి ఎక్కించాడు స్నేహితులకు. హోతా వీరభద్రయ్య, కనపర్తి లక్ష్మయ్య, రాచర్ల వెంకట్రామయ్య వీరేశలింగం చెప్పిన మాటలు విని, తపస్సు చేయాలని ఉద్రేకం పొందారు. హిమాలయాల్లోకి వెళ్ళి తపస్సు చేసి మూలికలు తెద్దామన్నారు. స్వర్ణయోగం నేర్చుకొందా మన్నారు. ఉండబట్టలేకపోయినారు. నిలవలేకపోయినారు. ఎప్పుడు మన ప్రయాణమని వేధించారు. వేగిరపడ్డారు. ఒకరోజున ఇక భరించలేక రేపే మన ప్రయాణమని వచ్చి చెప్పి పోయినారు వీరేశలింగానికి. ఆగండర్రా! అంటే మేమిక ఆగేది లేదన్నారు. "అయితే నేనిప్పుడే బయలుదేరలేనే" అన్నాడు వీరేశలింగం. "అయినా సరే మేం వెళతాం."

మర్రోజు పుస్తకాలు తీసుకొని బడికని చెప్పి హిమాలయాలకు ప్రయాణమైనారు వీరేశలింగం స్నేహితులు ముగ్గురూ. సాయంత్రం ఇంటికి రాలేదు వాళ్లు. వాళ్ళ వాళ్ళు బయలుదేరారు. పిఠాపురం దగ్గర ఒకరిని పట్టుకున్నారు. మరొకడు విజయనగరం దాకా వెళ్ళి ఇంకో స్నేహితుడితో పోట్లాడి వెనక్కు తిరిగి వచ్చేశాడు. మూడో అతడు పూరి జగన్నాథం వరకూపోయి, వెనక్కు వచ్చేశాడు.

పదమూడో ఏట పెళ్ళి చేశారు. కాతేరు కరణం వెన్నేటి వెంకటరత్నం. ఆయనే పెంచాడు, ఆయన మేనకోడలు బాపమ్మని. ఏడేళ్ళ పిల్ల, అద్దంకి పట్టాభి రామయ్యగారి కూతురు. తల్లిలేని పిల్ల. పెళ్ళి ఘనంగా జరిగింది. రెండు భోగం మేళాలు పెట్టారు - ఆడపెళ్ళి వాళ్ళొకటీ, మగపెళ్ళివాళ్ళొకటీ. వీరేశలింగానికి పన్నెండేళ్ళు. పెళ్ళి కూతురుచేత, పెళ్ళికొడుకుచేత రుక్మిణీ కళ్యాణం పద్యాలు చదివించి ముచ్చటపడ్డారు చుట్టాలు. వివాహంతో విద్యకు మంగళం పాడటం జరగలేదు. కోడలి పేరు "బాపమ్మ" నచ్చలేదు అత్త పున్నమ్మకు. తన తల్లిపేరు రాజ్యలక్ష్మి. ఆ పేరే కోడలికి పెట్టుకుంది.

కాని తల్లికీ, పెద్ద తల్లికీ వృద్ధ లెక్కువైనాయి. వేరింటి కాపురం వేర్పాటు చేసుకోక తప్పలేదు. మూడో తరగతి చదువుతూ ఉండగా పెద్ద జబ్బు చేసింది. ఆ సంవత్సరం చదువుపోయింది. మళ్ళీ చదివిన క్లాసే చదవాల్సి వచ్చింది. నాలుగో ఫారంలోనే ఉద్యోగంలో ప్రవేశించటానికి కావలసిన పరీక్ష ఒకటి గట్టెక్కాడు. ఉద్యోగ ప్రయత్నం చేశాడు. కాని పరీక్ష కాకపోయినా నూరు రూపాయలు లంచమిచ్చి ఎవరో ఆ ఉద్యోగం కొనుక్కున్నారు.

ఐదో తరగతి చదువుతూ ఉండగా పెద తండ్రికి పెద్ద జబ్బు చేసింది. ఆ ఏడు చదువూ వృధా అయిపోయింది. పెదతండ్రి కన్ను మూశాడు. ఆరో తరగతి, అదే మెట్రిక్యులేషన్ క్లాసు. కళాశాల ప్రవేశపరీక్ష అది. ఆ క్లాసులో చదువుతూ ఉండగా స్కూలు పిల్లల చేత సమ్మె చేయించాల్సి వచ్చింది వీరేశలింగానికి.

వైయాపురి మొదల్యారు హెడ్మాస్టరు. ఆయనకు ఇంగ్లీషు చెప్పటం చేతగాదు. పైగా దురుసుతనం. ఆయన్ను బదిలీ చేయించాలని మహజరు వ్రాసి, అన్ని క్లాసులకు పంపి సంతకాలు చేయిస్తున్నాడు వీరేశలింగం.

హెడ్మాస్టరుకు తెలిసి క్లాసుకు వచ్చి వీరేశలింగాన్ని 'బుద్ధి హీనుడా' అని తిట్టాడు. క్లాసులోంచి బయటకు వచ్చేశాడు వీరేశలింగం కోపంతో, అభిమానంతో. వెనకనే పిల్లలంతా వచ్చేశారు. సమ్మె ప్రారంభమైంది. హెడ్మాస్టరు పిల్లలందరినీ బెదిరించాడు. తరువాత బ్రతిమాలుకొన్నాడు. అయినా బదిలీ తప్పలేదు. పై అధికారులు వచ్చి విచారణచేసి, ఆయన్ను బదిలీచేసి, చెంగల్వ కుప్పుస్వామిగారిని హెడ్మాస్టరుగా వేశారు.

ప్రవేశపరీక్ష కాగానే, ఒక సంవత్సరం రాజమండ్రి స్కూల్లో ఉపాధ్యాయుడిగా వీరేశలింగం పని చేశాడు. స్కూల్లో చదువుకొంటున్న రోజుల్లోనే పెద్దతల్లితో వ్యాజ్యాలు వచ్చాయి. వీరేశలింగం తల్లి చాలా ధన నష్టం తెచ్చుకొన్నది ఈ వ్యాజ్యాలలో.

ఇరవై సంవత్సరాలు నిండుతూ ఉన్నప్పుడే వీరేశలింగానికి తానుకూడా కవిని కావలెనని అభిలాష కలిగింది. అప్పుడే ఆయన రెండు శతకాలు వ్రాశాడు. ఆ శతకాలతో తృప్తి కలగలేదు. అందరినీ మించిపోయే రచన చేయాలనే కోర్కె కలిగింది. అచ్చ తెలుగూ, నిర్వచనమూ, నిరోష్ఠ్యమూ కలిపి ఒక కావ్యం వ్రాసి, ఇంతకు పూర్వపు కవులకన్నా గొప్ప పేరు సంపాదించాలనుకొన్నాడు. 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం' అట్లా పుట్టిందే. ఈ కాలంలోనే 'రసిక జన మనోరంజనం' అనే మిశ్ర కావ్యం వ్రాశాడు.

1872వ సంవత్సరంలో కోరంగిలో ఇంగ్లీషు స్కూల్లో ప్రధానోపాధ్యాయుడి పదవి లభించింది.

# దేశ కాల పరిస్థితులు

సమస్త లోకం సుఖించడం కవుల కల్పన మాత్రమే అనుకోవాలి! నెలకు మూడు వానలు కురియడం, ప్రజలకు ఈతిబాధలు లేకపోవడం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, రక్షణలు సమస్త మానవాళీ అనుభవించడం ఎప్పుడైనా జరిగిందా?

ఒక్కొక్క కాలం మేలుగా ఉంటుంది. ఒక్కొక్కకాలంలో కనపడేది అంతా కీడే అనిపిస్తుంది. ఒక కాలంలో అనావృష్టి ఉండదు. అతివృష్టి బాధించదు. పంటలు బాగా పండుతాయి. ధరలు అదుపులో ఉంటాయి. అక్రమాలు ఉండవు. అన్యాయం తాండవించదు. ప్రజలకు తిండీ, బట్టా కరవుకావు.

ఒక్కొక్క కాలం వస్తుంది. వానలుండవు. పంటలుండవు. దొంగ నిల్వలు, అక్రమ లాభాలు, స్వార్థపరత్వం పెచ్చుమీరిపోతాయి.. ప్రజలలో అశాంతి, దుఃఖం, తిరుగుబాటు ధోరణి, కసి, కోపం, నిస్సహాయతతోకూడిన క్రౌర్యం, బయలుదేరుతాయి.

ఆహార ధాన్యాలు కనుమరుగైపోతాయి. దాచుకున్న వాళ్ళను దోచుకుంటారు. అదుపు తప్పితే అరాచకం తాండవిస్తుంది. మానవత్వం నశిస్తుంది. పిల్లలను పోషించుకోలేరు. ఒకప్పటి పచ్చటి పొలాలను బీడుపెట్టి, ఎక్కడికో లేచిపోతారు. తింటానికి తిండి ఉండదు. తాగటానికి నీరు ఉండదు. సాంక్రామిక రోగాలు వ్యాపిస్తాయి. సామూహిక మరణాలు సంభవిస్తాయి. ఆర్తనాదాలు వినిపిస్తాయి. అడుక్కున్నా పుట్టక ప్రజలు ఆక్రందనలు చేస్తారు.

ఇటువంటివన్నీ ప్రకృతి వైపరీత్యాలు. మానవ ప్రకృతి వైపరీత్యాలు ఇంతకన్నా తక్కువైనవేవీ కావు. అవి ఈతి బాధలు. ఇవి నీతి బాధలు. నీతి లేకపోవడంవల్ల వచ్చే బాధలు. మానవుణ్ణి మానవుడిగా చూడటమే అన్నిటినీ మించిన నీతి. దాన్ని మించిన నీతి లేనేలేదు.

స్వార్థపరత్వంకన్నా 'విషం' లేనేలేదు. విషజంతువుల విషం దానికి గురైనవాణ్ణి ఒక్కణ్ణే చంపుతుంది. స్వార్థపరుడి విషం వ్యవస్థ అనే వృక్షానికి వేరు పురుగులాచేరి, కాయలూ, పండ్లూ పురుగులమయం చేస్తుంది. వంచకులు, కపటులు, కల్లరులు, ధర్మకర్తలవుతారు. దొరికిన పావురాన్ని డేగ తినివేసినట్లు నదురూ బెదురూ లేకుండా నంచుకుంటూ, లొట్టలు వేసుకుంటూ, బలహీనులను, అమాయకులను బాధించి చంపుతారు. అదేమనేవాడే ఉండడు. అంటే డేగలు పావురాలను తింటాయని వేదంలో ఉంది అని నవ్వుతారు. దుర్వ్యాఖ్యానాలు చేస్తారు. కువ్యాఖ్యలు పుట్టిస్తారు. కుహనా మంత్రాలు చదువుతారు. బలవంతుడు బలహీనుణ్ణి గేలిచేసినట్లు, బక్కచిక్కిన గొడ్డును ఉక్కుముక్కు కాకి పొడిచి కండలు పైకిలాగినట్లు గుళ్ళలో, బళ్ళలో, అంగళ్ళలో దొంగ ధర్మకర్తలు బయలుదేరుతారు.

ఆచారపు మత్తుమందులు అలవాటు చేస్తారు. అజ్ఞానాన్ని బలవర్ధకాహారంగా పంచిపెడతారు. మనిషి సర్వనాశనానికి మనిషే కారకుడు. మనిషిని ఉద్ధరించడానికి మనిషే సాధకుడు. .

1881 వ సంవత్సరం జనాభా లెక్కలనుబట్టి, దేశం మొత్తం మీదనే కావచ్చుకాక, పాతికేళ్ళలోపు వితంతువులు పన్నెండు లక్షలు! పదేళ్ళలోపువాళ్ళు అరవైమూడువేలు. పదిహేనేళ్ళలోపువాళ్ళు లక్షా డెబ్భయినాలుగువేలు. నాటి భారతదేశపు జనాభాలో హిందువులు ఇంచుమించు పదిహేడుకోట్లు మాత్రమే.

అగ్రవర్ణాల బాల వితంతువుల స్థితి హృదయవిదారకంకాదా? అన్ని వర్ణాల వారిలోనూ ఇది ప్రచురంగా ఉండకపోవచ్చు.. కాని అగ్రవర్ణాల ముక్కుపచ్చలారని పుత్తడి బొమ్మలకు నిర్బంధ వైధవ్యం ఇహలోక నరకం కాదా? ఎందుకిట్లా జరిగింది? ముసలి వాళ్ళకు పెళ్ళి ఎందుకు? అందునా మూడోపెళ్ళి, నాలుగోపెళ్ళికూడా జరగటం ఉండేది.

ఆడపిల్లలు చదువుకోకూడదు. వాళ్ళకు లోకజ్ఞానం ఉండకూడదు. ఉంటే భూతవైద్యులెట్లా బ్రతుకుతారు? దయ్యమంటూ లేని ఇల్లే కనపడేదికాదుట ఆ రోజుల్లో.

ఇప్పుడా భూత ప్రేతాలన్నీ ఏమైనట్లు? నిజస్వరూపాలు వదిలిపెట్టి పునర్జన్మ పొందాయా? కనపడవేం! పురుషులు విచ్చలవిడిగా వ్యభిచరించటానికి ఒక వ్యవస్థ రూపొందిందా? అది తప్పుకాదా? సాంఘికామోదముద్ర లభించిందా? బోగందాన్ని ఉంచుకోకపోవడం పరువు తక్కువా? సాని పాపలను సంభావించకపోవడం సరసత్వానికి మచ్చా? పెళ్లిలో బోగం మేళం పెట్టకపోవడం గృహస్థుడి స్థితిలోపమా?

"అప్పుడు దయ్యములేని యిల్లు లేనేలేదని చెప్పవచ్చును. ఎవ్వరు క్రొత్తగా చచ్చినను వారు దయ్యములయి తిరుగుచుండిరని యెల్లవారును జెప్పుకొనుచుండిరి."

"ఆ కాలమునందు రాజకీయోద్యోగులలో లంచములు పుచ్చుకొనుట సర్వ సాధారణము పుచ్చుకొనకుండుట మృగ్యము."

"లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము. వేశ్యాంగనా సంగమము నీతిగాదన్న శృంగార నాయకులకు కోపము. పూర్వాచారమును మార్చుకోవలెనన్న పామరజనులకు కోపము. నీతి మాలిన బాహ్యవేషములు మతవిరుద్ధములన్న ఆచార్య పురుషులకు కోపము."

ఇవన్నీ వీరేశలింగంగారి మాటలే.

1833 లో రాజారామమోహనరాయలు నిర్యాణం చెందారు. ఆయన సతీసహగమనం మాన్పించటానికి ఎంతగానో కృషి చేయవలసి వచ్చింది. పామర జనంలో మూఢవిశ్వాసాలు పాతుకొనిపోయి ఉన్నాయి. పండితుల్లో కుతంత్రాలు, కూటరికాలు, మెండుకొని ఉన్నాయి. లేకపోతే వృద్ధ వివాహాలు శాస్త్ర సమ్మతమనీ, సతీసహగమనం పరమపద సోపానమనీ శాస్త్రాలు పుట్టించగలరా? కారికలు ఉద్ధరించగలరా? ఆడవాళ్ళు చదివితే చెడిపోతారని కారుకూతలు ప్రేలుతారా? స్త్రీలు చదువుకోకూడదని పత్రికలలో చర్చలు జరుపుతారా?

నాటి పరిస్థితులు కళ్ళముందు నిలుపుకొంటే ఒళ్ళు జలదరిస్తుంది. వీరేశలింగం కన్నతల్లినే దయ్యాలు మరణపర్యంతం బాధించాయి. ఇక తక్కిన వాళ్ళ మాట చెప్పాలా? దయ్యాల భయంచూపి ఉదరపూరణం చేశారు కొందరు. పరలోకం భయం చెప్పి, అజ్ఞానంలో ముంచివేశారు, ప్రజలను కొందరు. మనిషి రక్తం రుచిమరిగిన క్రోల్పులివలె

దురాచార మౌఢ్య పిశాచం అందరినీ ఆవహించింది. ఎదురుప్రశ్న వేసినవాళ్లే అణగ తొక్కింది. కరువులూ, కాటకాలు, కలరా మొదలైన సామూహిక వ్యాధులు ఎట్లా బాధిస్తవో అట్లానే వేశ్యలు, ఉద్యోగస్తులు, భూతవైద్యులు ఆనాటి సంఘాన్ని బాధించారు. బలవంతుడిదే రాజ్యం. అధికారిదే నీతి. కలకాలం దురన్యాయం కొనసాగాలనే కోరికతో, వంచనను పెంచుకొంటూ వచ్చారు, సాంఘిక వ్యవస్థనంతా చెప్పుచేతల్లో ఉంచుకొన్న వాళ్ళు.

వేమన్న చెప్పినట్లు కుత్సితులు చేరి గుణవంతులనుకూడా చెరుస్తారు. చీడపురుగు చెట్టును చెరుస్తుంది. వేరు పురుగు వృక్షాన్ని చెరుస్తుంది. ఇటువంటి వేరు పురుగులెన్నో సాంఘిక వృక్షాన్ని చేరాయి. ఇక దేశమనియెడి దొడ్డ వృక్షం ఏమైపోతుంది? ప్రేమలను పూలు ఎట్లా పూస్తుంది?!

మంచిఇల్లే కావచ్చు. బాగానే కట్టి ఉండవచ్చు. గాలీ వెలుతురూ ప్రవేశించడానికి అనువులన్నీ ఉండవచ్చు. కానీ పాడుపెట్టారు. కిటికీలు మూశారు. దీపం వెలిగించనేలేదు. తొండలూ, బల్లులూ, క్రిమికీటకాలూ, గడ్డీగాదం, బూజూ, తేళ్ళూ, జెర్రూ ప్రవేశించాయి. గోడలమీద మర్రిమొక్కలు మొలిచాయి. కప్పుమీద గద్దలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. ఆ ఇంట్లో ప్రవేశించటానికి ఎవరికైనా భయం పుట్టదా. అందునా రాత్రివేళ? "తిర్యగ్విద్వన్మహాసభ" అని వీరేశలింగం వ్రాసిన ప్రహసనం – అంటే పండిత జంతువుల సమావేశం చదివితే తెలుస్తుంది, ఈ ఇంట్లో ప్రవేశించటానికి భయం పుట్టేదీ పుట్టనిదీ. మనిషికి ప్రేత కళలాగా సంఘానికి పతన కళ చాలా భీతి గొలుపుతుంది.

సరిగ్గా పందొమ్మిదో శతాబ్దం ప్రవేశించేసరికి, సాంఘిక స్థితిగతులు భయంకరంగా ఉన్నాయి. చీకటిరాత్రి చివర సూర్యోదయం లాగా భారతదేశంలో రామమోహనరాయలు పుట్టాడు. స్వేచ్ఛకోసం స్వాతంత్ర్యంకోసం సమభావంకోసం తపించాడు. దీనులైన అబలలకోసం పరితపించాడు. మంచిచెడ్డలు ఎంచి చూపాడు. పత్రికలు నడిపాడు. పాత సిద్ధాంతాలు తప్పని నిరూపించాడు. ఇంగ్లీషు విద్యలు నేర్చుకొమ్మన్నాడు. ఇంగితం లేకుండా బ్రతకవద్దన్నాడు. హేతువాదపు కత్తి పట్టుకొని మూఢవిశ్వాసాల బందిపోట్లను పొలయింపచేశాడు. విగ్రహారాధన మానమన్నాడు. సాంఘిక దురాచారాలన్నిటినీ రూపుమాపటానికి ఎంతగానో కృషి చేశాడు. దేశంలో ఇంగ్లీష్షు విద్య బోధించడానికి తగిన పాఠశాలలు నెలకొల్పటానికి పాటుపడ్డాడు. సనాతనాచార పరాయణులూ, పండితులూ ఎంత వాదించినా, ఏ విధంగా ఎదిరించినా సతీసహగమనాన్ని రూపుమాపాడు.

రాజారామమోహనరాయలు మరణించిన పదిహేను సంవత్సరాలకు రాజమహేంద్రవరంలో వీరేశలింగం జన్మించాడు. వీరేశలింగం జన్మించేనాటికి రామమోహనరాయల కృషి తెలుగుదేశానికి కొంత వ్యాపించింది. తెలుగులో పత్రికలు ప్రారంభమైనాయి. అచ్చు యంత్రాలు వచ్చాయి. క్రైస్తవ మిషనరీలు తమ కార్యకలాపాలు సాగిస్తూ వచ్చారు. పాఠశాలలు నెలకొల్పుతూ వచ్చారు. పత్రికలు ప్రకటిస్తూ ఉన్నారు.

రామమోహనరాయలు, కేశవచంద్రసేన్, దేవేంద్రనాథఠాకూర్‌వంటి బ్రహ్మసమాజ నాయకుల బోధలు తెలుగుదేశందాకా వచ్చాయి. పర ప్రభుత్వం దేశీయుల యోగక్షేమాల

పట్ల తగినంత శ్రద్ధ కనపరచటంలేదని బుద్ధిమంతుల్లో అసంతృప్తి కూడా తలఎత్తింది. దాన్ని వ్యక్తీకరించటానికి ప్రయత్నాలూ చేశారు.

మేధావులు తమ లోపాలు తాము గుర్తించటం జరిగింది. సామూహికమైన చైతన్యం లేకపోతే అభివృద్ధి సాధించలేమనీ తోచింది.

గాజుల లక్ష్మీనరసుశెట్టి సంఘ విజ్ఞాపనలపైన వేలాది సంతకాలు చేయించి ఇక్కడ పరిస్థితులను చక్కదిద్దమని మహజర్లు సీమకు పంపించాడు.

కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళ బాలికా పాఠశాలకోసం డెబ్బయివేల రూపాయలు దానం చేశాడు.

హిందువులు సంఘాన్ని సంస్కరించుకోకపోతే దుర్దశ పాలవుతారని లింగం లక్ష్మాజీ విశాఖపట్నం బాలికా పాఠశాల ప్రారంభోత్సవం నాడే హెచ్చరించాడు (1869). అటు తరువాత రెండేళ్ళలోనే కాకినాడలో బాలికా పాఠశాల వెలసింది.

బందరులో ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ ఉన్న ఆత్మూరి లక్ష్మీనరసింహం బ్రాహ్మసమాజ ప్రభావానికి లోనైనాడు.

సామినేని ముద్దు నరసింహులనే వారి 'హితసూచని' అన్న గ్రంథం 1862 నాటికే వెలువడింది. అంతకుపూర్వమే ఎప్పుడో ఆ గ్రంథాన్ని ఆయన వ్రాశాడు. ఆయన కుమారుడు 1862లో దాన్ని అచ్చువేశాడు. ముద్దునరసింహులుగారందులో కులాచారాలను విమర్శించాడు. నిర్బంధ వైధవ్యాన్ని దుయ్యబట్టారు. బాల్య వివాహాలను గర్హించారు. లోకంలో అన్యాయాలూ, అక్రమాలూ జరుగుతున్నప్పుడు బుద్ధిమంతులు ఉపేక్ష చేయకూడదని హెచ్చరించారు.

వంగ దేశంలోను, మహారాష్ట్రంలోనూ సంఘ సంస్కార భావాలు తలయెత్తాయి. సంస్కరణల కృషి ప్రారంభమైంది. తెలుగుదేశాన్ని యీ వాతావరణంకూడా కొంతవరకు ప్రభావితంచేసి ఉంటుంది. పుదూరి అనంతరామశాస్త్రిగారనే వ్యక్తి నెల్లూరు ప్రాంతపు వాడు, సంఘ సంస్కరణ భావాలను ప్రచారం చేశాడని తెలుస్తున్నది. పరవస్తు రంగాచార్లవారుకూడా సంఘ సంస్కరణపట్ల సౌముఖ్యం కనపరచారు.

వీరేశలింగం పెద్దవాడై, తనచుట్టూ ఉన్న ప్రపంచం ఆయనకు బాగా అవగతం అయ్యేవేళకు, తెలుగుదేశంలో, సాంఘిక దురన్యాయాలపట్ల, ప్రజల దృష్టిని త్రిప్పినవారు వీరు.

ఇంగ్లీషు చదువులు ఇందుకెంతో దోహదం చేశాయి. మనోదాస్యం రూపు మాపటానికి విజ్ఞాన దృష్టి కలిగించటానికి, మూఢ విశ్వాసాలు పోగొట్టడానికి, హేతువాదం అలవరచడానికి ఇంగ్లీషు విద్యలు చాలా సహాయం చేశాయని అప్పటి విద్యాధికులు పత్రికలలో వ్రాశారు.

అయినా వాళ్ళ సంఖ్య అత్యల్పం, వాళ్ళ ప్రయత్నాలు చెప్పుకోదగిన ఫలితాలు సాధించలేదు. నూటికి పదిమందికూడా ఆ సమాజంలో అక్షరాస్యులు లేరు. నూటికొక్కరే చదువుకొన్న మహిళ అని నాటి జనాభా లెక్కలే చూపుతున్నాయి.

అది ఒక సంధి యుగం. తెలుగుదేశానికి సంబంధించినంతవరకు అంధయుగం. పదిమంది ఒకచోటచేరి సామాన్య జన సంక్షేమాన్ని గూర్చి మాట్లాడుకోవటం అపహాస్యానికి

గురి అయ్యేది. అధిక్షేపానికి వీలయ్యేది. విద్యార్థులు నలుగురెవరైనా చేరి మాట్లాడుకొంటే 'మీటింగువాళ్ళు వీళ్ళేను' అంటూ అజ్ఞాన ప్రజ అపహాస్యం చేసేవాళ్ళు.

ఉద్యోగస్తులంతా బహిరంగంగానే వేశ్యలను ఆదరించేవాళ్ళు. శుభ కార్యాల మిషలు కల్పించుకొని ఇండ్లవద్ద 'మేజువాణీ'లు ఏర్పాటు చేసేవాళ్ళు. సామాజికులు ఆ మేజువాణీలకు హాజరై, కానుకలు చెల్లించుకోవాలి. లేకపోతే, ఆ ఉద్యోగస్తుల ఆగ్రహానికి గురి అవుతారు. ఈ కానుకలను 'ఒసగు'లనే వాళ్ళు. అట్లా అధికారుల ఇండ్లలో జరిగే సానిపాపల ఆటపాటల వినోదాలకు ఎవరైనా హాజరుకాకపోతే, కట్నాలు చెల్లించకపోతే ఉద్యోగులు అటువంటి వాళ్ళను విడిచిపెట్టేవారు కాదు. ఎన్ని విధాలుగానో బాధించేవాళ్ళు.

పోలీసు శాఖవారు అధికార దుర్వినియోగం చేసేవాళ్ళు. అమాయకులను కడగండ్లపాలు చేసేవాళ్ళు.

ఈ పరిస్థితుల్లో వీరేశలింగానికి ప్రపంచమంతా అవగాహనం కాసాగింది.

# సంస్కారభావాలు - తిరుగుబాటు ధోరణి

చిన్నప్పటినుంచీ సత్యాసత్యాలు తెల్సుకోక ఒకరు చెప్పింది నమ్మటం వీరేశలింగం స్వభావంలో లేదు. కాబట్టి మంత్రాలను పరీక్షించాలని అభినివేశం కలిగింది. ఇంతలో ఏ మిత్రుడి దగ్గరో కేశవచంద్రసేన్ ఉపన్యాసాల పుస్తకం కంటపడింది. అది తీసుకొని చదివాడు వీరేశలింగం. అంతటితో ఎన్నెన్నో ప్రశ్నలు తలెత్తాయి. నమ్మకాలు సడలిపోతున్నాయి. దీనికితోడు క్లాసులో ఆత్మూరి లక్ష్మీనరసింహంగారి బోధలు. ఈయన బందరునుండి వచ్చాడు. బ్రహ్మసమాజాభినివేశం ఉండేది మొదట్లో ఆయనకు. మిత్రులు ఐదారుగురుచేరి అనేక విషయాలు చర్చించుకోవడం సాగించారు.

ఇంతలో చిత్రపు కామరాజుగారు కబురు చేశారు. ఈయన తెలుగు ప్లీడరు. రెండు చేతులా డబ్బు సంపాదిస్తున్నాడు. మాంచి మాటకారి. చమత్కారి, రసికుడు. 'నెలకు ఇరవై రూపాయలిస్తాను, ఇంగ్లీషులో ఉత్తర ప్రత్యుత్తరాలు రాసిపెడతావా?' అని అడిగాడు. సరేనన్నాడు వీరేశలింగం. పనిలో చేరాడు. ఉదయంపూట రెండు మూడు గంటల పనిచూస్తే చాలు. అయితే ఉంచుకొన్న సానివచ్చి కామరాజు పంతులుతో సరసాలు సాగించటం, అసహ్యమనిపించింది వీరేశలింగానికి; ఉద్యోగానికి స్వస్తి చెప్పాడు. హైస్కూలు హెడ్మాస్టరు బారో దొరకు ఇంటి దగ్గర తెలుగు చెప్పాడు. నెలకు పదిహేను రూపాయలిచ్చే వాడాయన. 1870లో మెట్రిక్యులేషన్ ప్యాసైనాడు.

ఇంతకుముందొక సంఘటన జరిగింది. తెలియక ఒక స్నేహితుడితో చీట్లపేక ఆడటానికి సాని ఇంటికి పోయినాడు. సానికూడా వచ్చి చేతులు కలిపేసరికి దిగ్గున అక్కడినుంచి లేచి వచ్చేశాడు. అంతటితో సాని గడప మరి తొక్కలేదు జీవితంలో. మెట్రిక్యులేషన్ ప్యాసైన తరువాత పాఠశాలలో తాత్కాలికంగా ఉపాధ్యాయ పదవి లభించింది. ఒక్క సంవత్సరం పని చేశాడు. నెలకు ఇరవై అయిదు రూపాయల జీతం. ఒక్క సంవత్సరం గడిచిపోగానే పని నిలిచిపోయింది.

1872 వ సంవత్సరం వచ్చింది. అప్పటికే చెన్నపట్నం నుంచి 'ఆంధ్రభాషా సంజీవని', బందరునుంచి 'పురుషార్థ ప్రదాయిని' అనే పత్రికలు - ఇవి రెండూ మాసపత్రికలే - వస్తూ ఉండేవి. ఆంధ్ర భాషా సంజీవని పత్రికలో ఎవరెవరో ఆడవాళ్ళు చదువుకోకూడదు. చదువుకొంటే లోకానికి హాని - అని వ్రాస్తూ ఉండేవాళ్లు. అయితే బందరు పత్రికలో ఆడవాళ్ళకు చదువు అవశ్య కర్తవ్యం అని వ్రాస్తూ ఉండేవాళ్ళు.

వీరేశలింగానికి ఉత్సాహం పుట్టింది. మీ పత్రిక చాలా గొప్ప పత్రికే అని పాండిత్యపు డబడబలతో కొక్కొండ వెంకటరత్నంగారికి ఉత్తరం వ్రాశాడు మొదట. తరువాత ఆయన ఆడవాళ్ళు చదువుకోకూడదనటం ఏ మాత్రం నచ్చలేదు. "ఆడవాళ్ళు తప్పకుండా చదువుకోవాలి. అప్పటిదాకా దేశానికి మంచి రోజులు రావు. పూర్వకాలంలో ఇటువంటి ఉన్మాదపు సిద్ధాంతాలు ఉండేవి కావు" - అని పురుషార్థ ప్రదాయినిలో చెన్నపట్నం పత్రికలోని వ్రాతలకు సమాధానంగా చురుకుగా వ్రాయటం సాగించాడు.

ఈలోపున ఒక వింత జరిగింది. పెరటిలోని అరటిచెట్టు మధ్యనుండి గెలవేసింది. దైవజ్ఞులూ బంధువులూ వచ్చి, ఆ చెట్టు కొట్టేయాలి, లేకపోతే అరిష్టమన్నారు. ఏం

జరుగుతుందో చూదామనుకొన్నాడు. ఏం జరగలేదు. గెల పండింది. కాయలు పెద్దవైనాయి. గెల కోయించి చెట్టు కొట్టి వేయించాడు.

అప్పుడే ఇంట్లో నడిమి దూలానికి తేనెపట్టు పట్టింది. అశుభమన్నారు శాస్త్రాలు చదివినవాళ్ళు. శాంతికర్మలు చేయించాలన్నారు. అదేమీ జరగదని ఖండితంగా చెప్పాడు వీరేశలింగం.

అప్పటికే మంత్రతంత్రాలు కుతంత్రాలని ఆయన నిశ్చయించుకొన్నాడు. జ్యోతిషంలో నమ్మదగింది లేదని తేల్చుకొన్నాడు. భూతవైద్యులు కపటులని గ్రహించుకొన్నాడు. శకునాలు, ముహూర్తాలు మూఢ నమ్మకాలని తోసి పారేశాడు.

కోరంగిలో ఉద్యోగం వచ్చింది. అమావాస్యనాడు పోయి పనిలో చేరాడు. ఎందుకయ్యా ఇలాంటి రోజున వచ్చి చేరావని అడిగారు ఒకరు. ఆయనతో "చెడ్డ రోజులూ, మంచిరోజులూ అంటూ వుండవు. మనుషులు కల్పించుకొనేవేకాని" అని వాదించేసరికి, ఆయనకూడా ఈయన దారిలోకి రాక తప్పింది కాదు.

కోరంగిలో ఉండగా పాఠాలు చెప్పటానికి సులభ పద్ధతి కనుక్కోవాల్సి వచ్చింది. సంగ్రహ వ్యాకరణం రచించి పాఠాలు సులభంగా చెప్పసాగాడు.

తల్లికి దయ్యాలపైన నమ్మకం విపరీతం. ఎప్పుడూ ఏదో ఒక భూతమో, దయ్యమో, ప్రేతమో, పిశాచమో ఆమెను పట్టుకొని బాధిస్తూ వదలకుండా ఉండేది. కోరంగిలో ఉండగా పటాటోపంగా భూతవైద్యుడొకడు వచ్చాడు. నుదుట రూపాయంత బొట్టు, పెద్ద పెద్ద గోళ్ళు, వికటమైన కళ్ళు, గుబురుమీసాలు, కాళ్ళకు పావుకోళ్ళు, చేతిలో బెత్తం, విరబోసుకొన్న జుట్టు చూస్తేనే జడుసుకొనేటట్లున్నాడు. పూటకు శేరు బియ్యం తినేవాడు. గంజాయి దమ్ము పట్టేవాడు. భూతవైద్యులపైన నమ్మకం లేకపోయినా తల్లికోసం, సరే వైద్యం ప్రారంభించమన్నాడు వీరేశలింగం. ఆ భూతవైద్యుడు వైద్యం ప్రారంభించాడు. ఇంటిలోనే తిష్ఠ వేశాడు. మాటకుముందు పావలా, అర్ధా, ఇవ్వమంటం సాగించాడు. మేమని తనను గూర్చి అహంకారంగా, నీవని ఎదుటి వారిని గూర్చి చులకనగా ప్రేలటం సాగించాడు. కొద్దిరోజులు అన్నిటినీ వోర్చుకున్నాడు వీరేశలింగం. వాడు చాలా అహంకరించాడు. అది చెప్పి ఇది చెప్పి డబ్బు లాగుదామని చూశాడు. "మా అమ్మకు పూర్తిగా నయమైందాకా చిల్లిగవ్వ ఇవ్వను" అని స్పష్టంగా చెప్పేశాడు వీరేశలింగం.

వాడు వికృతంగా, క్రూరంగా పళ్ళు పటపట లాడిస్తూ, నిన్నేం చేస్తానో చూడు. అని చిందులు తొక్కాడు. పోరాపో అని పాఠశాల భటుడితో మెడబట్టి గెంటివేయించాడు వీరేశలింగం. ఇరుగుపొరుగు వచ్చి వీరేశలింగాన్ని శాంతింపజేయాలని చూశారు. వాడితో నీకెందుకు వాడు చేతబడి చేస్తాడో, భూతాలను ఉసికొల్పుతాడో అని నయాన భయానా చెప్పారు.

రేపీపాటికి నిన్నేం చేస్తానో చూడమని, వాడు వేరే ఇంట్లోకి పోయి, తల విరపోసుకొని, అలికి ముగ్గులు పెట్టి, హ్రాం, హ్రీం అని అర్ధరాత్రిదాకా కేకలువేసి, గంజాయిదమ్ము మహత్యమో, కొబ్బరి నీళ్ళ పైత్యమో, ఊగి ఊగి ఎవరో తోసినట్లు భ్రమపడి తూలి పడిపోయినాడు. వీరేశలింగం తనమీదికేదో భూతాన్ని పంపించాడని వాడికి దడ పట్టుకుంది. జ్వరం వచ్చింది. పలవరింతలు పుట్టాయి. సంధి ప్రేలాపన

ప్రారంభమైన [illegible] దరువు మొదలయింది భూతవైద్యుడి స్థితి. వీరేశలింగం ఎవరిదగ్గర శరభసాళ్వ మంత్రం [illegible] దర్పంగానో ఆ భూతవైద్యుడు విన్నాడు. ఆయన ఆ మంత్రం ప్రయోగించాడని భ్రమపడ్డాడు. ఏనుగులాంటివాడు పీనుగైపోయాడు.

వీరేశలింగం జాలిపడి, ఆ భూతవైద్యుణ్ని ఇంటికి తీసుకొని వచ్చి, నెల రోజులు వైద్యం చేయించి పంపించాల్సి వచ్చింది. తల్లి భ్రమ పోగొట్టటానికి, నమ్మకం లేకపోయినా వీరేశలింగం శరభసాళ్వం ఉపదేశం పొందిన మాట నిజమే. కాని భూతవైద్యుడికి అతని భయమే పెద్ద దయ్యమై ప్రాణాలు తీయబోయింది.

ఇంతటితో మంత్ర తంత్రాలపైనా, భూతవైద్యాలపైనా, ఇదివరకున్న అణుమాత్రపు నమ్మకంకూడా పోయి, ఇవన్నీ ఉదరపూరణంకోసం వేసిన కపట వేషాలన్న సంపూర్ణమైన నిశ్చయం చేసుకొన్నాడు వీరేశలింగం.

కోరంగిలో సుమారుగా రెండేళ్ళు ఉన్నాడు. అక్కడి ప్రధానోపాధ్యాయుడుగా ఉన్న రోజుల్లో అధికారులకు అడుగులకు మడుగులొత్తలేదు. మీ విధేయుణ్ని, చిత్తం, బత్తెం అనలేదు. స్వతంత్రంగా, నిర్భయంగా, తన విద్యుక్తధర్మాన్ని నిర్వహించాడు. స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు పాఠశాల తనిఖీకి వస్తే, ఆయన సరసనే కుర్చీ వేయించుకొని కూచున్నాడు. వేరే మేస్టరు చెప్పవలసిన పాఠాన్ని వీరేశలింగాన్ని చెప్పమంటే నేను చెప్పనని, అధికారి ఆజ్ఞను నిర్భయంగా నిరాకరించాడు.

కోరంగిలో పనిచేస్తున్న రోజులలోనే శుద్ధాంధ్రోత్తర రామాయణాన్ని రచించి బందరులో పురుషార్థ ప్రధాయినిలో భాగభాగాలుగా ప్రకటించాడు.

సంగ్రహ వ్యాకరణం పిల్లలకోసం కూర్చాడు. నీతి దీపికను కూర్చాడు. క్రింది తరగతుల పిల్లలకు నీతులు బోధించే గీత పద్యాల పుస్తకం ఇది.

కోరంగిలో ఉన్న రోజుల్లోనే అప్పుడు గుంటూర్లో ఆంగ్లో వెర్నాక్యులర్ స్కూలులో పనిచేస్తున్న రంగాచార్లనే వారితో వీరేశలింగానికి వ్యాకరణంలో సంధి విషయంగా వాద వివాదాలు కలిగాయి. ఇద్దరూ పురుషార్థ ప్రదాయినిలో తమ వాదాలను సమర్థించుకొంటూ లేఖలు ప్రకటించారు. "తప్పులెన్నువారు తండోపతండమ్ము" అనే పద్యాన్ని ఉదహరిస్తూ వీరేశలింగం, రంగాచార్లగారిని తీవ్రంగా విమర్శించాడు. శుద్ధాంధ్రోత్తర రామాయణం పూర్తిచేసిన తరువాత భారతాన్నికూడా సంగ్రహంగా, అచ్చ తెనుగు కావ్యంగా వ్రాద్దామని ప్రారంభించాడు. సభాపర్వంలో కొంత భాగం "ఆంధ్రభాషా సంజీవని"కి పంపించాడు. దాన్ని ఆ పత్రిక అచ్చువేసింది. అప్పటికే కవులూ, పండితులూ అభినవ తిక్కన అనీ, ప్రౌఢకవి అనీ, గొప్ప పండితుడనీ పొగడ్తలు కురిపించారు. కాలేజీ తరగతులకు పాఠ్యపుస్తకాలుగాకూడా పెట్టారు. అట్లా వుండగా, "తెలుగులో పద్య కావ్యాలు కుప్పలు తెప్పలుగా ఉన్నవి. వచన కావ్యాలు లేవు" అనే ఆలోచన వచ్చింది. రాజమండ్రి దగ్గర ధవళేశ్వరంలో ప్రధానోపాధ్యాయుడి ఖాళీవచ్చి, వీరేశలింగానికా ఉద్యోగం వచ్చింది.

వచన కావ్యాలు కావాలి తెలుగులో అనుకొన్నాడు. ధవళేశ్వరం వచ్చేశాడు. 1874వ సంవత్సరం అది.

# వజ్రాయుధం వంటి పత్రిక

ధవళేశ్వరం, 1874.
ఆంగ్లో - దేశభాషా పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు వీరేశలింగం.
నెలకు నలభై నాలుగు రూపాయల జీతం.
తెలుగులో వచన కావ్యాలు లేవు.
తెలుగు సాహిత్యాన్ని వికసింపచేయాలి.
శాఖోపశాఖలుగా విస్తరింపచేయాలి.
ఇదివరకు ఎవరు వ్రాశారు వచన కావ్యాలు?!
చిన్నయసూరి గొప్ప పేరు ప్రతిష్ఠలున్న పండితుడు.
కాలేజి తరగతులలో
ఆయన మిత్రలాభం, మిత్రభేదాలు ఎప్పుడూ పాఠ్యాంశాలే.
ఆయన విగ్రహ తంత్రం దాకా రాకుండానే పరమపదించాడు.
ముందుగా దాన్ని పూర్తి చేదాం-
ఆయన చాలా ప్రౌఢంగా రచించాడే.
అదే శైలిలో పూర్తిచేస్తే బాగేమో. దానికి తగ్గిపోకూడదు.
ఒక వాసి మించాలి. లేకపోతే తన పరువేమవుతుంది?
అనుకున్నది వెంటనే ఆచరణలోకి తేవాలి.
అనుకున్నదానికీ, నెరవేర్చడానికీ అట్టే అంతరం ఉండకూడదు.
మీనమేషాలు లెక్క పెట్టడమనేది జీవితంలోనే లేదు.
పద్యమైనా, గద్యమైనా ధారా ప్రవాహంగా వ్రాయడమే.
కొట్టివేతలూ, తుడుపులూ, హంసపాదులూ అవసరం లేదు.
విగ్రహ తంత్రం రచించడమూ అయింది.
అచ్చు వేయటమూ అయింది
పండితులు మెచ్చడమూ అయింది.
ఎన్నో అభినందన లేఖలు.
పాఠ్య పుస్తకంగా ఎన్నిక కావటమూ జరిగింది.

ప్రవేశపరీక్షకు, అంటే మెట్రిక్యులేషన్‌కు పాఠ్య పుస్తకంగా చేశారు. వెయ్యి రూపాయలు వచ్చాయి. ఉత్సాహం వచ్చింది. తరువాత సంధినికూడా రచించాడు.

ఇ.పి. మెట్కాఫ్ గురువులకు గురువు. గొప్ప విద్యావేత్త. సంధి తంత్రాన్ని ఆయనకు బహూకరించాడు అంకితంగా. ఆయన రాజమండ్రి కాలేజీ ప్రిన్సిపాల్‌గా బహుకాలం పనిచేశాడు. నిజంగా గొప్పవాడు.

పద్య కావ్యాలూ, గద్య కావ్యాలూకూడా కీర్తి ప్రతిష్ఠలు తెచ్చాయి. ధనాగమనం కలగజేశాయి. అందరూ పొగడుతున్నారు. అవలీలగా పద్యాలు పలకగలడని మిత్రులకు సన్నిహితులకు తెలిసిపోయింది.

అష్టావధానం చేయమని పట్టుబట్టారు. చూసి సంతోషిస్తామని ముచ్చటపడ్డారు. ధవళేశ్వరంలో ఒకరోజున ఒక మిత్రుడి ఇంటిలో అష్టావధానం చేశాడు. మేంకూడా చూడాలి, మరోసారి చేయాలి అని పెద్దలు, ఉద్యోగస్థులు, ప్రముఖులూ కోరారు. మళ్ళీ చేశాడు. ఇది విని రాజమహేంద్రవరపు పురప్రముఖులు బ్రతిమాలుకొన్నారు. రాజమహేంద్రవరంలోకూడా శాస్త్రీయంగా పెద్ద ఎత్తున అష్టావధానం చేశాడు. ఆ రాత్రి విపరీతమైన తలనొప్పి వచ్చింది. మేథకు చాలా బాధ అంతకు తప్ప ప్రయోజనం లేదు. పామరులు ఏదో ఉపాసన అనుకుంటారు. కాదన్నా నమ్మరు. పోనీ తనకెందుకు? ఇక తాను మాత్రం అష్టావధానం చెయ్యడం, తలనొప్పితో బాధపడటం వుండదు అని నిశ్చయానికి వచ్చాడు.

దేశంలో కవిగా, పండితుడిగా కీర్తి ప్రతిష్ఠలు వచ్చాయి. పుస్తకాలు వ్రాసి డబ్బు సంపాదించవచ్చునన్న విశ్వాసం కలిగింది. కాని తన భావాలు ప్రచారం చేయడం ఎట్లా? స్త్రీలంతా చదువుకోవాలని ప్రచారం చేయాలి. తన పుస్తకాల మీద విమర్శకులకు ప్రతి విమర్శలు ప్రకటించాలి. తనకుకూడా ఒక పత్రిక వుండాలి.

అక్టోబరు నెల 1874. ఆశ్వయుజం వివేకవర్ధని మాసపత్రిక ధవళేశ్వరంనుంచి వెలువడింది.

రాజమండ్రికి నాలుగుమైళ్ళు ధవళేశ్వరం. వివేకవర్ధని చెన్నపట్నంనుంచే అచ్చయ్యేది. ధవళేశ్వరంనుంచి విడుదలయ్యేది.

ధవళేశ్వరంలో స్త్రీ విద్యనుగూర్చి చాలా ప్రచారం చేశాడు.

తత్ఫలితంగా బాలికా పాఠశాలను స్థాపించారు. వీరేశలింగం వచ్చి ఏడాదికూడా తిరగకుండానే వివేకవర్ధనిలో జోరుగా స్త్రీ విద్యను గూర్చి ప్రోత్సాహకంగా పద్యాలు, గద్యాలు వెలువడుతున్నాయి. వ్యతిరేకంగా ఆంధ్రభాషా సంజీవనిలో విమర్శలు వస్తున్నాయి. కృతి విమర్శనీ సమాజం పేరుతో కొక్కొండ వేంకటరత్నం తన సంజీవనిలో వీరేశలింగం విగ్రహతంత్రాన్ని ఆక్షేపించాడు. వివేకవర్ధనిలో గుణాగుణ ప్రదర్శనీ సమాజం పేరుతో వేంకటరత్నాన్ని దుయ్యబడుతూ వీరేశలింగం ఆ వ్రాతలన్నిటినీ తిప్పి కొట్టాడు.

తన చుట్టూ కనబడుతున్న సమాజంలో ఎంతో దుర్మార్గం. మంచికి ఏ మాత్రం స్థానంలేదు. ఎక్కడ చూసినా వంచనకు, అవినీతికి జయజయధ్వానాలు. వేశ్యల ప్రాబల్యానికి మితిలేదు. గొప్ప గొప్ప అధికారులను, ఉద్యోగస్థులను వేశ్యలు పిడికిళ్ళలో పెట్టుకొని ఆడిస్తున్నారు. రాజమహేంద్రవరంలోని వేశ్యలు చాలకపోతే, ఇతర ఊళ్ళనుంచి వచ్చారు. అధికారులలో విపరీతమైన లంచగొండితనం. ఇవన్నీ రూపుమాపాలి. దేశక్షేమంకోసం పాటుపడాలి. ఆ మార్గంలో ఎన్ని ప్రమాదాలొచ్చినా భయపడకూడదు. ఈ పత్రిక స్థాపించడం ప్రధానోద్దేశాలు రెండు – దేశాభివృద్ధీ, భాషాభివృద్ధీ.

ప్రజలలో దురాచారాలు, దుర్వర్తనలు రూపుమాపి, అభివృద్ధి మార్గాలను చూపి, ప్రజలను నీతిమంతులుగాచేసి, దేశాన్ని ఉన్నత స్థితికి తీసుకొని రావడానికి శక్తివంచన లేకుండా పాటుపడటం ద్వారా దేశాభివృద్ధి సాధ్యమవుతుంది. విద్యా విషయాలు, దేశ వ్యవహారాలు, కులాచారాలు, నీతి, మతం మొదలైన వాటి విషయంగా చెడును దిద్ది, మంచినే పెంచే పూనికగానే వివేకవర్ధని పుట్టింది.

తెలుగు భాషలో మృదువైన సులభశైలిలో వచన రచన చేయటం భాషాభివృద్ధికి తగిన మార్గం.

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్.

ఈ పద్యం వివేకవర్ధనికి ఆదర్శం. ముఖపత్రంపైని కనుపడుతుంది తిలకంగా. మూడు నెలలు, నాలుగు పేజీలుగా మాసపత్రికగా వచ్చింది. తర్వాత కొత్త సంవత్సరంలో 1875 జనవరినుంచి 17 పుటల పుస్తక రూపాన వెలువడటం ప్రారంభమైంది.

వీరేశలింగానికి కొన్నాళ్ళకిందట న్యాయవాద వృత్తిమీద సదభిప్రాయమే ఉండేది. తానూ ఆ వృత్తినే అవలంబిద్దామనుకొన్నాడు. కాని లోకజ్ఞానం హెచ్చేకొద్దీ ఆ కోరిక హరించుకొనిపోయింది. ఉపాధ్యాయత్వం మంచిదే. స్వతంత్ర వృత్తే. కాని విదేశీయులు కార్యనిర్వాహకులుగా ఉంటే లాభంలేదు. స్వతంత్రంగా ఉండటానికి వీలులేదు.

ధవళేశ్వరంలోకూడా వీరేశలింగం ఒక సమాజం ఏర్పాటుచేశాడు. సాంఘిక సమస్యలను, వ్యక్తి వికాసానికి సంబంధించిన విషయాలను ఆ సామాజికులు, ఆదివారాలు చేరి చర్చించుకొనేవాళ్ళు.

రాజమండ్రిలో 1875లో బసవరాజు గవర్రాజు అనే యువకుడు, దేశ భాషా పాఠశాలా సమాజాన్ని స్థాపించాడు. వీరేశలింగాన్ని వచ్చి ఆ సమాజంలో ఉపన్యసించమని కోరాడు. ఇద్దరూ ఒకరినొకరు పోల్చుకున్నారు, దగ్గరైపోయినారు. ఆదివారం రాగానే నాలుగుమైళ్ళు నడిచి రాజమండ్రి వెళ్ళేవాడు. అక్కడ ఉపన్యాసం చెప్పేవాడు. మళ్ళీ ధవళేశ్వరం చేరేవాడు వీరేశలింగం. సమాజంలో కనబడుతున్న కుళ్ళు, కల్మశం, దుర్నీతి, వివేకవర్ధని పుటల్లో లోకానికి దుర్భరంగా ఉంది. బలవంతులకు, ధనవంతులకు పెద్ద పెద్ద పదవుల్లో ఉన్నవాళ్ళకు ఆగ్రహం అవధులు దాటుతున్నది.

ఎక్కడ ఏ అక్రమం కనబడ్డా చూసి సహించే స్వభావంకాదు వీరేశలింగానిది. దానికి ప్రతిక్రియ పుట్టవలసిందే. ఎన్ని కష్టాలైనాసరే, ఎన్ని నష్టాలైనాసరే లెక్కలేదు.

ధవళేశ్వరం స్కూల్లో తాను ప్రధానోపాధ్యాయుడు. కమిటీ మెంబర్లతో ఆయనకు భేదాభిప్రాయం కలిగింది. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. కాలమంతా గ్రంథరచనకూ, పత్రికకూ వినియోగించవచ్చు. తన జీవితలక్ష్యాలను త్వరితగతిన సాధించవచ్చు. దేశాభివృద్ధి, భాషాభివృద్ధి, ఆయన రెండు కళ్ళు. వీటిని త్వరితంగా సాధించాలి. ఉద్యోగం బెడద వదల్చుకొన్నాడు. ఇప్పుడు కావలసినంత స్వాతంత్ర్యం. కాలం కలసి వస్తుంది.

రాజమహేంద్రవరానికి మార్చాడు రంగస్థలం. అక్కడ స్థాన బలిమి ఉంది. తన బలిమి సరేసరి. మిత్రులను ప్రోత్సాహపరచి, భాగస్థులను చేర్పించి మంచి ముద్రణాలయాన్ని స్థాపించాడు. ఈ సందర్భంగానే చెన్నపట్నం వెళ్ళాడు. అక్కడ బహుజనపల్లి సీతారామాచార్యులుగారూ, ఇంకా మిత్రులూ ఎంతగానో గౌరవించారు. సభ చేశారు ఫొటోలు తీయించారు వెండిపాత్రను బహూకరించారు.

1876 వివేకవర్ధని ముద్రాక్షరశాల ఇంట్లోనే నెలకొల్పాడు. రాజమండ్రినుంచి అవిచ్ఛిన్నంగా 'వివేకవర్ధని' వెలువడుతున్నది. ఒక సంచికలో ఇట్లా వ్రాశాడు :

'ఈ కాలంలో జారిణీసంభోగమే సత్కృత్యం. కట్టుకొన్న ఆలిని దుఃఖపెట్టడం, వ్యభిచారం చేయటం, తప్పుకాదట. వేశ్యనుంచుకోకపోతే పెద్ద మనుష్యుడు కాదట వ్యభిచరించని వాడు పురుషుడేకాడు. ఒట్టి నపుంసకుడు. పెద్ద పెద్ద ఉద్యోగస్తులున్నారు చూశారూ. వేశ్యల ఇంటి బంట్లు వాళ్ళతో అంటే ఉద్యోగస్తులతో ఎవరికేదైనా పనిఉంటే ఈ వేశ్యల కాళ్ళు పట్టుకోవాలిపోయి.'

ఇంకొక సంచికలో-

'భోగంమేళాలున్నాయి. నాయుడుగారి మేళం, పంతులుగారి మేళం, శాస్త్రిగారి మేళం. శుభకార్యం జరిగిందా, ఏదో మేళం పెట్టాల్సిందే. ఆ మేళం నాకెందుకనుకోటానికి వీల్లేదు.'

తరువాత తరువాత సంచికలలో -

'ఇక వసూళ్ళు చేయకపోతే కొంప మునిగిందన్నమాటే. సంఘంలో పెద్ద మనుషులంతా, అట్లా భోగంవాళ్ళకు కట్నాలు చెల్లించనివాణ్ణి వెలివేసినట్లే చూస్తారు.'

'ఒక గొప్ప ప్లీడరుగారు నిన్నరాత్రి మహావైభవంగా, ఫలాని వీధిని కన్నెరికం జరిపించారు.'

'మండల న్యాయాధిపతిగారైన వాలేస్ దొరగారు ప్లీడరు పట్టాల సత్రం నడుపు తున్నారు. అడగనివాడిదే పాపం. నల్లకోటు కుట్టించుకోకపోవడమే లోపం. ప్లీడరు పట్టా కావాలా? ఎవరికైనా? కులమత వివక్షతలులేవు. రండు! రండు! ప్లీడరు పట్టా గైకొనుండు.'

'ఓహో! ఒక గొప్ప వింత డిస్ట్రిక్టు కోర్టులో తీర్పుల వేలంపాట. మున్సిఫ్‌గారు పెద్ద పాట పాడిన వాడి పక్షాన న్యాయాన్ని కొట్టేస్తారు.'

'ఇచ్చట జడ్జిమెంట్లు వ్రాసి ఇవ్వబడును. వింతలలో వింత. భలే మంచి చౌక బేరము. సుజనులారా కొనుడీ! మరి దొరకదు. ఆలసించిన ఆశాభంగం.'

'మహా దొంగయోగిని బొందెతో కైలాసయాత్ర. గోదావరిలో పడబోతుంటే ఆత్మహత్యనుంచి ఆమెను తప్పించినవైనం.'

'వ.వ.మహా మహా స్వాములవారి అంతరంగిక శిష్యపరమాణువు ఎవ్వరు? ఎన్ని ప్రాయశ్చిత్తాలు చేయించి చేర్చుకొన్నారు. స్వాములవారు ఈ కులటా పుత్రుణ్ణి!'

ఈ విధంగా ఎన్నో, ప్రతి సంచికలోనూ లోకానికి వెల్లడి కావల్సిందే.

"ఫలాని పెద్ద మనిషిగారు రంకుల రాట్నం నడిపిస్తున్నారు.

ఫలాని వారి ఇంటిమీద రాళ్ళు పడ్డంలో అంతర్యం.'

"దంభాచార్యులుగారూ, నమస్కారం. విన్నటి సంచికలో తమరినిగూర్చి వివేకవర్ధనితో..."

వెనుకటికొక సామెత చెపుతారు. కసిపోక మసి పూసుకున్నాట్ట ఒక ప్రబుద్ధుడు. మాన నష్టం దావాలు, అభియోగాలు, హుంకరింపులు, నిన్నేం చేస్తామో చూసుకో అని

బెదిరింపులు ఎందరో ప్రబుద్ధులు. అయినా భయపడలేదు. లొంగలేదు. వజ్రాయుధానికి నూరంచులు. వివేకవర్ధని అటువంటిది. కొక్కొండ వేంకటరత్నంగారికి వివేకవర్ధని వ్రాతలు కోపం తెప్పించాయి. "నిర్ధవకవేవి-" అని 'దడిగాడువానసిరా"లా తిరగేసి చదివి వెక్కిరించాడు. "హాస్యవర్ధని" అని తన సంజీవనికి అనుబంధ పత్రిక పెట్టాడు. వివేకవర్ధనిని వెక్కిరించడమే, వేళాకోళం చేయడమే దాని సాఫల్యం. పుట్టువు సార్థకత అనుకొన్నాడు.

వీరేశలింగం ఊరుకున్నాడా?! ఒకటికి రెండు అంటించాడు. "హాస్య సంజీవని" అని తానూ, అనుబంధ పత్రిక పెట్టాడు. బాగా కోపం వచ్చినప్పుడు సంజీవని వ్రాతలను పడతిట్టాడు. "బహ్మావివాహం" వ్రాశాడు వాడుకభాషలో. గుంపులు గుంపులు చేరి ఆ పుస్తకాన్ని మెచ్చుకొన్నారు. "హాస్య సంజీవని" కోసం అర్రులు చాచారు. కనపడగానే ఉర్రూతలూగారు. "పెద్దయ్యగారి పెళ్ళి పుస్తకం" ప్రతినోటా చెప్పుకొన్నారు. అటు తరువాత "ప్లీడరు నాటకం" వచ్చింది హాస్య సంజీవనిలో. దాన్ని వ్యవహార ధర్మబోధిని అన్నాడు వీరేశలింగం. కాని ప్రజలు ప్లీడరు నాటకమనే పిల్చుకొన్నారు దాన్ని.

పోలీసుల దొంగతనాలు, న్యాయవాదుల అన్యాయాలు, అధికారుల కండకావరాలు, భలే వేళాకోళం పట్టించాడు. పిల్లలచేత వేషాలు కట్టించి యీ ప్రహసనాన్ని ఆడించాడు. ప్లీడర్లు తలలు వంచుకొన్నారు. అధికారులు లోపల లోపలనే చేసేదిలేక ఏడ్చుకొన్నారు. జడ్జిమెంట్ల ఫార్సు గూర్చి విచారణ జరపక తప్పలేదు ప్రభుత్వానికి.

మున్సబుగారి తీర్పుల వేలంపాట గూర్చి పెద్ద గ్రంథం నడిచింది. అంతా బట్టబయలైంది.

చిత్రపు కామరాజుగారు చిత్తు తీర్పులు రాసిపెట్టే పెద్ద మనిషి మరి మార్గం లేక ఆత్మహత్య చేసుకొన్నాడు.

మున్సబుగారికి మతి చలించింది.

వీరేశలింగానికి జైలు తప్పదని మురిసిపోయిన వాళ్ళంతా మూర్ఛలు పోయినారు. చంకలు గుద్దుకున్న వాళ్ళంతా తలలు బాదుకున్నారు. రాజమండ్రి అంతా హడలు పుట్టించాడు. వివేకవర్ధని, వివేకవ.......

ప్రభుత్వోద్యోగులు, ప్లీడర్లు, స్వాములవార్లు, భోగంచానలు గడగడ వణికారు. పడ తిట్టిపోశారు. అయితేనేం అర్నెల్లకే పక్షపత్రిక అయింది. 1876 జూలై, పున్నముకూ అమావాస్యకూ, ప్రతిపక్షులకూ - విపక్షులకూ మరీ గుండెలదరిపోయినాయి. ఇంగ్లీషు విభాగమూ ఉంది. తెలుగు తెలియని వాళ్ళకోసం, అధికారులకోసం, అక్రమాలు తెలుసుకోవడం కోసం.

తెలుగు విభాగం సరేసరి. దేశాభివృద్ధీ, భాషాభివృద్ధీ, చిన్న చిన్న వ్యాసాలు, వార్తలు, వ్యాఖ్యలు, పద్యాలు, నాటకాలు, శాకుంతలం, మర్చెంట్ ఆఫ్ వినీస్, కామెడి ఆఫ్ ఎర్రర్స్, పూర్వ కవుల గ్రంథాలు, పుస్తక సమీక్షలు, హాస్య సంజీవనులు, వీరేశలింగం సాక్షాత్కారం. యముడు లాగానూ, చందమామలాగానూ, యద్భావం తద్భవతి. ఎవరికర్మ వాళ్ళే అనుభవిస్తారని కూచోలేదు. అక్రమాల మీద విక్రమించాడు. తెలుగు మాన్యాన్ని చక్కగా పండించాడు.

# సాహిత్య వికాసం

పత్రిక పెట్టి దురాచారాలు రూపుమాపడంద్వారా దేశాభివృద్ధి - వచన కావ్యాలు సృష్టించి, తెలుగులోలేని ప్రక్రియలన్నీ తెచ్చి సుసంపన్నం చేయడంద్వారా భాషాభివృద్ధి సాధించాలని వీరేశలింగం పూనుకొన్నాడు. సంఘంలోని లోపాలన్నీ వివేకవర్ధనిద్వారా ఎత్తి చూపుతున్నాడు. కావ్యరచన నిరంతరాయంగా కొనసాగుతూ ఉన్నది.

వీరేశలింగం రచయితగా రూపొందిన నాటికి తెలుగులో నాటకాలులేవు. నవలలు లేవు. కథలులేవు. శాస్త్రీయ గ్రంథాలు లేవు. ప్రయత్నాలు మాత్రం జరిగాయి. సంస్కృతం నుంచీ, ఇంగ్లీషునుంచీ నాటకాలనువదించే పని అప్పుడు ప్రారంభించారు కొందరు. నవల వ్రాయటానికి కూడా ఒకరిద్దరు పూనుకొని కొంత ప్రయత్నం చేశారు. వీరేశలింగానికా విషయాలు తెలిసి ఉండకపోవచ్చు. ఆ రోజుల్లో పత్రికలున్నా, వాటికి వ్యాప్తి తక్కువే.

నరహర గోపాలకృష్ణమ్మచెట్టి అనే ఆయన ఒక వచన ప్రబంధం వ్రాశాడు, వీరేశలింగానికన్నా ఆరేళ్ళముందే. వచన ప్రబంధమంటే నవలనే వాళ్ళ ఉద్దేశం మొదటిరోజుల్లో. హిందువుల ఆచారములు తెలిపే వచన ప్రబంధమన్నాడు గోపాలకృష్ణమ్మ చెట్టి, తన శ్రీ రంగరాజచరిత్రను. అది నవలా రచనకు తొలి ప్రయత్నం. 1872లో అది అచ్చయింది. గోపాలకృష్ణమ్మగారప్పుడు కర్నూలులో డిప్యూటీ కలెక్టరుగా ఉండేవారు. ఆయన వ్రాసిన శ్రీ రంగరాజ చరిత్రను ఆవాల్టి మద్రాసు గజటు తొలి నవలగానే పేర్కొన్నది. సమకాలీన పత్రికలుకూడా దాన్ని నవలనే అన్నాయి. ఇంకెవ్వరూ తరవాత నవల వ్రాయలేదు. శ్రీ రంగరాజ చరిత్రం చిన్న పుస్తకం. పాత్ర చిత్రణంలో మెళకువలు లేవు, శిల్పంలేదు, ఒక పెద్ద కథలాగా సాగింది.

1878లో వీరేశలింగం నవలా రచనకు పూనుకొన్నాడు. ఆలివర్ గోల్డ్‌స్మిత్ నవల వికరాఫ్ వేక్ ఫీల్డును అనువదించటానికి పూనుకొన్నాడు.

రెండు మూడు ప్రకరణాలు వ్రాసిన తరువాత, తెలుగు పాఠకులకు ఆ అనువాదం రుచించకపోవచ్చు అనుకొన్నాడు.అందువల్ల ఆ ప్రయత్నం విరమించుకొని, ఆ కథను మాత్రం ఆధారంగా పెట్టుకొని, కొన్ని కల్పనలు చేర్చి రాజశేఖర చరిత్రం వ్రాశాడు. గోల్డ్‌స్మిత్ నవలకిది అనుసరణమేకాని, అనువాదం కాదన్నమాట. తన వివేకవర్ధనిలో 1878లో సీరియల్‌గా ప్రచురించి, రెండేళ్ళ తరవాత పుస్తకంగా ప్రకటించాడు.

విగ్రహతంత్రం రచించినప్పుడే మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో ప్రొఫెసర్ సమర్థి రంగయ్యగారు విగ్రహ రచనను మెచ్చుకొంటూ, తెలుగులో స్వతంత్రంగా వచన ప్రబంధ రచనకు మీరు పూనుకోలేరా? అని ప్రోత్సాహ వాక్యాలు పలికాడు.

అది ప్రేరణ అయింది వీరేశలింగానికి, రాజశేఖర చరిత్ర రచించటానికి. తెలుగు నవలా రచన రాజశేఖర చరిత్రతోనే ఒక స్వరూపం పొందిందని చెప్పవచ్చు. పాఠకులు విశేషించి ఆదరించలేదు. అయినా పత్రికలు మెచ్చుకొన్నాయి.

ఒక మధ్య తరగతి గృహిక కుటుంబములోని అవకతవక ఆచారాలు, నమ్మకాలు, ఎగుడు దిగుళ్ళు అన్నీ ఈ నవలలో [illegible] అంతకుపూర్వం రాజులు, దేవతలు, అతిమానుష శక్తులు, తిర్యక్కులు కావ్య వస్తువులు.

సామాన్య మానవుడు, అతడి మంచిచెడ్డలతో కథా నాయకుడు కావటం రాజశేఖర చరిత్రమంచే మొదలు.

భూస్వామ్య వ్యవస్థకు భరతవాక్యం, ప్రజాస్వామ్యానికి ప్రస్తావన సాహిత్యంలో రాజశేఖర చరిత్రం తెచ్చిన గొప్ప సన్నివేశం.

పద్యమూ, పండితుడూ పాతతరం ప్రతినిధులు కాగా, వచనమూ, ప్రజా సాహిత్యమూ కొత్త తరానికి స్వాగతం పలికాయి. ఈ పలకటం వీరేశలింగంతోనే ప్రారంభమైంది. అంతకుముందు వచనం వచనంకాదు. అంతకుముందు నాటకానువాదాలు మొదలైనవి ప్రథమ ప్రయత్నాలే. దానికి రూపురేఖలు కూర్చినవాడు వీరేశలింగం. అందుకే నవల, నాటకం, చరిత్ర, కథ, విమర్శ, తెలుగులో తానే ప్రారంభించానన్నాడు వీరేశలింగం. అందులో అసత్యమేమీ లేదు.

అంతకుపూర్వం కోరాడ రామచంద్రశాస్త్రి అనేవారు నాటకానువాదం మొదలు పెట్టిన మాట నిజమే. కొక్కొండ వేంకటరత్నంగారు ఒక రూపకాన్ని అనువదించిన మాటా నిజమే. వావిలాల వాసుదేవ శాస్త్రి ఇంగ్లీషునుంచి సీజరు చరిత్రను అనువదించింది నిజమే అయినా ఆ ప్రయత్నాలలో కొన్ని లోపాలు కనపడ్డాయి వీరేశలింగానికి. ఆ లోపాలు పరిహరించి, యథాశక్తి తాను ప్రయత్నించాడు. కొన్ని తెలుగులోకి కొత్తగా తెచ్చాడు.

కాళిదాసు శాకుంతలాన్ని తెలుగు చేయటానికి పూనుకొన్నాడు. గొప్ప పండితుడు పరవస్తు వేంకటరంగాచార్యులుగారుకూడా శాకుంతలం తెలుగు చేస్తున్నారని విని, తన అనువాదం ఆపుచేశాడు వీరేశలింగం. ఏడాది చూశాడు. రెండేళ్ళు చూశాడు. రంగాచార్లగారు అనువాదం పూర్తిచేయలేదు.

1880లో వీరేశలింగం తన శాకుంతలానువాదం ప్రకటించాడు. భవభూతి ఉత్తర రామచరితం అనువదించాలనుకొన్నాడు. కాని ఆయన మిత్రుడు వావిలాల వాసుదేవశాస్త్రిగారు, తాను చేస్తున్నానని చెప్పాడు. తానా ప్రయత్నం మానుకున్నాడు వీరేశలింగం.

థార్వాడ కంపెనీవాళ్ళు వచ్చి నాటకాలాడారు రాజమండ్రిలో. అక్కడినుంచి వేరే ఊరికి వెళ్ళిపోయారు. వాళ్ళు నాటకాలాడిన పాకలు విప్పలేదు. వీరేశలింగం అప్పుడు కాలేజీలో తెలుగు పండితుడుగా పనిచేస్తున్నాడు.

తన శిష్యులను తరిఫీదుచేసి నాటకాలాడించాలన్న కోర్కె కలిగింది. షేక్స్పియర్ రచించిన 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్' ఆకర్షించింది. 'చమత్కార రత్నావళి' అని పేరు పెట్టి అనువాదం చేశాడు. ధార్వాడ వాళ్ళు నాటకాలాడిపోయిన పాకలో చమత్కార రత్నావళి ఆడించాడు. శ్రీహర్షుడి రత్నావళికూడా అనువాదం చేశాడు. ఆ నాటకమూ ఆడించాడు. తెలుగుదేశంలో, తెలుగు నాటకాలు మొట్టమొదటిసారిగా ప్రదర్శన చేయించినవాడు

వీరేశలింగం. నాటకాలమీది ఉత్సాహంతో చదువులు అశ్రద్ధ చేస్తారేమోనని విద్యార్థులను ఇక చేరదీయలేదు. నాటకాలాడటానికి. ఇక నాటకాలాడించలేదు. కాని ఆడించిన నాటకాలు చూసి అంతా మెచ్చుకొన్నారు. పత్రిక నడుపుతూ, గ్రంథ రచన చేస్తూ, ధవళేశ్వరంలో ఉపాధ్యాయ పదవి వదలి రాజమండ్రిలో స్థిరపడిన తర్వాత కొన్నాళ్ళు ఉద్యోగం చేయలేదు.

తరువాత మిత్రులు, శ్రేయోభిలాషులు, పెద్దలు సలహా చెప్పారు. గవర్నమెంటు కాలేజీలో తెలుగు పండితుడిగా చేస్తావా అని అడిగినప్పుడు ముందు కాదన్నా, తరువాత సరేనన్నాడు. సెకండ్ పండిట్‌గా కాలేజీలో ఉద్యోగంలో చేరాడు. ధవళేశ్వరంలో నలభై నాలుగు రూపాయల జీతం. కాలేజీ పండితుడిగా ఇరవై అయిదు రూపాయలే నెల జీతం అయినా వొప్పుకున్నాడు. పనిలో చేరాడు. అప్పటినుంచీ రిటైరైందాకా ఆ ఉద్యోగంలోనే ఉన్నాడు.

వివేకవర్ధనిలో ఇంగ్లీషు నాటకానువాదాలు, సంస్కృత నాటకాల అనువాదాలు, స్వతంత్ర రచనలు, నవలలు, విమర్శ మొదలైనవి, ఇంకా పూర్వ కవుల కావ్యాలు పరిష్కరించి ప్రకటించేవాడు. కనపర్తి అబ్బయ్య రచించిన కవిరాజ మనోరంజనం అనే పురూరవ చరిత్రము వివేకవర్ధనిలో వెలువడ్డ పూర్వకవుల కావ్యం. షేక్స్పియర్ నాటకం ది మర్చంట్ ఆఫ్ వెనీస్, అవే పాత్రలతో అనువదించటానికి పూనుకొన్నాడు. కాని తృప్తి కలగలేదు. కొంతదూరం సాగి ఆగిపోయినాడు. అట్లానే ది కామెడి ఆఫ్ ఎర్రర్స్ అనే నాటకాన్నికూడా అవే ఊర్లు, పేర్లతో అనువదించాలనుకున్నాడు. కొంతభాగం అనువాదం చేసి ఆగిపోయినాడు. అటు తరువాత "చమత్కార రత్నావళి" పేరుతో పాత్రల పేర్లు, ప్రదేశాలు మార్చి అనువాదం చేశాడు.

ఇంగ్లీషునుంచి అనువాదం చేసినవి మూడు నాటకాలు. షేక్స్పియర్ రచించిన "ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్"తో పాటుగా షెరిడన్ విరచితమైన "ది రైవల్స్", "డ్యూయన్నా" అనే నాటకాలనుకూడా "కళ్యాణ కల్పవల్లి", "రాగమంజరి" అనే పేర్లతో దేశ కాల పాత్రలు మార్చి వీరేశలింగం అనువదించాడు. ఇంగ్లీషు పద్య కావ్యాలనుకూడా తెలుగు వాళ్ళకు పరిచయం చేసే ఉద్దేశంతో కౌపర్ విరచిత మైన "జాన్ గిల్పిన్" అనే లఘు కావ్యాన్ని, ఆలివర్ గోల్డుస్మిత్ రచించిన "ది ట్రావెలర్" అనే కావ్యాన్ని అనువదించాడు.

సంఘ సంస్కరణ విషయంలో ఏ విధంగా నిరంతరమూ వీరేశలింగం పాటుపడుతూ వచ్చాడో అట్లానే సాహిత్య విషయికంగా కూడా ఆయన పరిశ్రమిస్తూనే వచ్చాడు. ఇంగ్లీషునుంచీ, సంస్కృతం నుంచీ సుప్రసిద్ధ నాటకాలను అనువదించడమే కాకుండా, స్వతంత్ర నాటకాలను రచించాడు.

ప్రహ్లాద, సత్య హరిశ్చంద్ర, దక్షిణ గోగ్రహణం – ఆయన రచించిన స్వతంత్ర నాటకాలు. ప్రహ్లాద నాటకంలో పరిశుద్ధాస్తిక మతాన్ని గూర్చిన ప్రబోధం ఉన్నది. కాని, న్యాయానికి వీరేశలింగం ఈ నాటకం వ్రాసి ఉండవలసిందికాదు. అతిమానుష, అమానుష అద్భుతాద్భుతమైన వర్ణనలన్నీ ఇతర సందర్భాలలో ఆయన పరిహాసానికి గురిచేశాడు. కాని ఎవరో వచ్చి తాము ప్రదర్శించుకోవటానికి ప్రహ్లాద నాటకం కావాలని అడిగారుట.

అందువల్ల త్వరత్వరగా దానినాయన వ్రాసి ఇచ్చాడు. అయినా సంఘ సంస్కరణమూ, పరిశుద్ధ మత ధర్మ ప్రకటీకరణమూ ఈ నాటకంలోకూడా ఆయన ప్రవేశపెట్టాడు.

దక్షిణ గోగ్రహణంలోకూడా అప్పటి సాంఘిక సమస్యలను వ్యాజ రూపంలో ప్రస్తావించి నివారణ మార్గాలు చూపాడు వీరేశలింగం. అటు తరువాత సత్యహరిశ్చంద్ర నాటకం ఐదంకాలలో రచించాడు. స్త్రీ విద్యను గూర్చి, భక్తి ప్రపత్తులను గూర్చి, సత్యధర్మ దయా శౌచాల గూర్చి వీరేశలింగం ఇందులో దీర్ఘ సంభాషణలలో ప్రస్తావించాడు. ఏ గ్రంథం వ్రాసినా, ఏ రచన చేసినా, ఏదో సందర్భాన్ని తీసుకొని వచ్చి సంఘ సంస్కరణావశ్యకతను, బ్రహ్మసమాజ ప్రబోధాలను ఆయన ప్రవేశపెట్టటానికి వెనుకాడేవాడు కాడు.

కృష్ణమిశ్రుడనే కవి రచించిన ప్రబోధ చంద్రోదయ నాటకం సంస్కృతంలో ప్రౌఢమైనది. అది అద్వైత సిద్ధాంత ప్రతిపాదితేతివృత్తమైనది. దానిని వీరేశలింగం ప్రౌఢంగా, సరసంగా, సమర్థంగా తెనిగించాడు. సందర్భాన్ని బట్టి బ్రహ్మసమాజ భావాల నాయన ప్రచారం చేశాడీ నాటకంలో. అట్లానే కాళిదాసు మాళవికాగ్ని మిత్రం తెనిగిస్తూ – పీఠికలో పూర్వకాలపు స్త్రీలు విద్యావంతులై, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనుభవిస్తూ ఉండేవారనటానికి కావలసినన్ని దాఖలాలున్నాయి అంటూ వ్రాశాడు.

సంస్కృతంనుంచి నాలుగు నాటకాలు – శాకుంతల, మాళవిక, రత్నావళి, ప్రబోధ చంద్రోదయం వీరేశలింగం అనువదించాడు.

స్త్రీ పునర్వివాహ సభా నాటకం పేరుతో కొన్ని అంకాలు మాత్రమే వ్రాసి పూర్తి చేయకుండా విడిచి పెట్టాడు. ఆసాంతమూ పద్య నాటకంగా వీరేశలింగం దీన్ని ఉద్దేశించడం ఇందులో విశేషము.

అట్లానే వీరేశలింగం అసంపూర్ణంగా విడిచిన ఇంకొక స్వతంత్ర నాటకం వివేక దీపిక. స్త్రీ పునర్వివాహాన్ని గూర్చిన సమస్యలే ఇందులోని ఇతివృత్తం.

వీరేశలింగం సాహిత్య జీవితంలో రాజశేఖర చరిత్ర రచనా కాలం ఒక ప్రధానమైన మలుపు. ఆయన సాంఘిక జీవితంలోనూ అది గొప్ప మలుపే. అప్పటికి వీరేశలింగానికి ముప్పయ్యేళ్ళు నిండాయి. ఆయన వ్యక్తిత్వం సంపూర్ణంగా రూపురేఖలు దిద్దుకొన్నది. 1880లో రాజశేఖర చరిత్ర పుస్తక రూపాన ప్రకటించాడు. 1881లో నడుం కట్టుకొని సంఘ సంస్కరణ కృషి ఆయన సాగించాడు. రాజశేఖర చరిత్ర రచనకు ముందే వ్యవహార ధర్మబోధిని అనే ప్లీడరు నాటకమూ, బ్రహ్మ వివాహమనే పెద్దయ్యగారి పెళ్ళి పుస్తకమూ ప్రకటించాడు. అభాగ్యోపాఖ్యానమనే వికట కావ్యం సృష్టించాడు. స్వంత కల్పనలేమీ లేకుండా, పూర్వ కవులను అనుకరిస్తూ పిల్ల వసుచరిత్రలు పుట్టించే కవులపై అభాగ్యోపాఖ్యానం గొప్ప చురక. పూర్వకవుల పద్యాల "పేరడీలు" చాలా ప్రతిభావంతంగా ఈ కావ్యంలో వ్రాశాడు వీరేశలింగం.

సంఘ సంస్కారోద్బోధకాలైన ప్రహసనాలెన్నో హాస్య సంజీవనిలో ప్రకటించేవాడు. 1883లో ప్రత్యేకించి స్త్రీల కొరకు, వీరేశలింగం ఒక పత్రిక నడిపాడు. ఆయన తరవాత ఇవాల్టి వరకూకూడా అటువంటి ప్రయత్నం మరెవరూ చేయలేదు. ఈ పత్రికద్వారా వీరేశలింగం స్త్రీల విద్యా విజ్ఞాన వికాసాలకోసం చేసిన కృషి అద్భుతమైనటువంటిది.

ఇందులోనే మొట్టమొదటి సాంఘిక నవల అచ్చైంది. అది సత్యవతీ చరిత్రం. ఆదర్శ దాంపత్యం అంటే ఎట్లా ఉంటుందో నిరూపించాడీ గ్రంథంలో. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి లాంటి గొప్ప కథకులుకూడా ముచ్చటపడ్డారీ నవలను చదివి. ఇందులో నాయిక సత్యవతి. ఆ కాలంలో పుట్టిన ఆడపిల్లల కెందరికో సత్యవతి పేరు పెట్టుకొన్నారు విద్యాధికులు, సంస్కారాభిమానులు. ఆ రోజుల్లోనే ఈ నవల అరవంలోకి, కన్నడంలోకి, ఇంగ్లీషులోకి అనువాదం పొందటం గొప్ప విషయం.

ఈ సతీ హితబోధినిలోనే చంద్రమతీ చరిత్రనుకూడా నవల రూపంలో ప్రకటించాడు వీరేశలింగం. సులభ శైలిలో స్త్రీ విద్యావశ్యకతను గూర్చీ, దేహ గేహ పరిశుభ్రతలనుగూర్చీ, నవలా రూపంగా ప్రస్తావించాడు.

తరవాత చిన్న పిల్లలు సహితం చదివి ఆనందించడానికి ఒకానొక ఇంగ్లీషు కథనాధారంగా చేసుకొని "సత్య సంజీవని" అనే పెద్ద కథను వ్రాశాడు. మన సంఘంలో స్త్రీల విషయమైన అన్యాయాలు నలుగురి దృష్టికి తీసుకొని రావటానికిగాను సత్యరాజా పూర్వ దేశయాత్రల పేరుతో జొనాథన్ స్విఫ్టు అనే ఇంగ్లీషు రచయిత గ్రంథమైన "ది గలివర్స్ ట్రావెల్స్"ను అనుసరించి ఒక గ్రంథం ప్రచురించాడు వీరేశలింగం: దీన్ని రెండు భాగాలుగా ప్రకటించాడు. మొదటి భాగం "ఆడ మళయాళం"గానూ రెండో భాగం "లంకా యాత్ర"గానూ ఆ రోజుల్లో చాలా ప్రసిద్ధికి వచ్చి, ఎందరో చదివారు. మళ్ళీ దీన్ని ఇంగ్లీషులోకి అనువాదం చేశారు. కన్నడంలోకికూడా అనువాదం పొందడం చాలా గొప్ప విషయం.

ఈ సత్యరాజా పూర్వదేశ యాత్రల గ్రంథంలో, స్త్రీల విద్యా విహీనతవల్ల కలిగే అనర్థాలు, సంఘంలోని మూఢ విశ్వాసాలు, పడుపు వృత్తివల్ల సంఘానికి జరిగే హానీ, సాంఘికాచారాల పేరిటి సర్వ దురాచారాలు తీవ్రంగానూ, పరమ హాస్యాస్పదంగానూ నిరసించాడు. రెండో భాగమైన లంకాయాత్రలో జ్యోతిష విశ్వాసాలను వేళాకోళం చేయడం జరిగింది. పురుషుణ్ణి గాడిదనూ నెలకొకసారి అయినా దండించకపోతే వాళ్ళు చెడిపోతారనటం, పత్ని ఎంగిలి భుజించడం పరమ మోక్షప్రద మనటం, ఆడ మళయాళంలో పత్ని మరణించగానే పురుషుల ముక్కులు తెగగోయటం ప్రాచీనాచారం అనటం – వీరేశలింగానికి ఆనాటి సంఘంపైన ఉన్న తీవ్రమైన కసినీ, అసహ్యాన్నీ వ్యక్తం చేస్తాయి.

వీరేశలింగం ఇంగ్లీషునుంచి బలాత్కార గాన వినోదం, అసహాయ సూర ప్రహసనం, మహాబధిర ప్రహసనం, మహావంచక ప్రహసనం మొదలైన పది ప్రహసనాలు, దేశకాల పాత్రలను తెలుగుచేసి ప్రకటించాడు.

షేక్స్పియర్ నాటక కథలను చార్లెస్ ల్యాంబ్ వచన రూపంగా వ్రాస్తే, వాటిని తెలుగులో దేశకాల పాత్రలను మార్చి ప్రకటించాడు. ఆ రోజుల్లో స్త్రీలూ, పురుషులూకూడా అత్యాసక్తితో ఈ కథలు చదివి ఆనందించారు.

ప్రజలలో మూఢ విశ్వాసాలు పోగొట్టాలంటే ప్రకృతి శాస్త్ర జ్ఞానం ఆవశ్యకం. ఆ దృష్టితో పదార్థ వివేచన శాస్త్ర రచనకు పూనుకొన్నాడు వీరేశలింగం. తనకన్నా

విద్యాధికులొకరాపని తాము ప్రారంభించామని తెలిపితే, అంతటితో ఆ గ్రంథాన్ని ఆపివేశాడు.

తరవాత శరీర శాస్త్రాన్ని తెనిగించాడు. తరువాత జ్యోతిశ్శాస్త్ర సంగ్రహం ప్రకటించాడు. అటు తరవాత జంతు స్వభావ చరిత్రం రచించాడు.

ఇవికాక స్త్రీలకు అత్యంతావశ్యకంగా శరీరారోగ్య ధర్మాలను బోధించే "దేహారోగ్య ధర్మబోధిని" "పత్నీ హిత సూచని" అనే గ్రంథాలు వ్రాశాడు. తాను నడిపిన సతీహిత బోధిని పత్రికలో స్త్రీల కోసం, ప్రకృతిశాస్త్ర విషయాలనుగూర్చి సులభశైలిలో ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. వాటిని సతీహిత బోధిని పేరుతో పుస్తక రూపంగా ప్రకటించాడు.

మాతృపూజ, పితృపూజ, సత్యాద్రౌపదీ సంవాదం, స్త్రీ నీతిదీపిక మొదలైన లఘు రచనలు వాళ్ళు చదువుకోవటానికి, పాడుకోవటానికి అనువుగా వీరేశలింగం రచించాడు.

స్త్రీలకు, పిల్లలకు ఆసక్తిదాయకంగా ఈసఫ్ నీతికథలను అనువదించి, బొమ్మలతో సహా ప్రకటించాడు.

తెలుగుదేశాన్ని శాశ్వతంగా ఋణగ్రస్తుణ్ణి చేసేది ఆయన కవుల చరిత్ర. ఇంచుమించుగా రెండు వందల నలభైమంది కవుల చరిత్రను వీరేశలింగం మూడు సంపుటాలుగా కూర్చాడు.

జీవితచరిత్రలు వ్రాశాడు. రాజారామమోహన్‌రాయలు, జీసస్, విక్టోరియారాణి మొదలైనవారి చరిత్రలు వ్రాశాడు.

స్వదేశ సంస్థాన చరిత్రం పేరుతో దేశ చరిత్ర వ్రాశాడు.

ఉత్తమ స్త్రీ చరిత్రల పేరుతో జీవిత రేఖాచిత్రాలు ప్రకటించాడు. ఇంకా బసవరాజు గవర్రాజు, మాకర్ల సుబ్బారావు నాయుడు మొదలైన మహనీయుల జీవిత రేఖాచిత్రాలు ప్రకటించాడు అనీబిసెంట్, అహల్యాబాయి. శంకర, రామానుజ, మధ్వాచార్య చరిత్రలు ప్రకటించాడు.

అలంకార సంగ్రహం, తర్క సంగ్రహం, కావ్య సంగ్రహం మొదలైన సాహిత్య శాస్త్రీయ గ్రంథాలు వ్రాశాడు.

సంగ్రహ వ్యాకరణం పాతికేళ్లయినా నిండకుండానే రచించాడు.

నవ్యాంధ్ర వ్యాకరణ రచనకు శ్రీకారం చుట్టి, కొంతభాగం నిర్వహించి అంతలోనే కీర్తి శేషులైనాడు. లేకుంటే సర్వసమగ్రమైన తెలుగు వ్యాకరణం అర్ధశతాబ్దికి పూర్వమే లభించి ఉండేది.

వాచక పుస్తకాలనుంచి శ్రుతి, స్మృతుల వ్యాఖ్యానాల వరకూ వీరేశలింగం చేయని సాహిత్య వ్యవసాయం లేదు; పండించని పంట లేదు.

రసహీనమైన శుష్క పాండిత్యాన్ని సరస్వతీ నారద విలాపం ద్వారా పరిహసించాడు.

ఇక ఉపన్యాసాలు అసంఖ్యాకంగా ప్రకటించాడు. చిన్నవీ పెద్దవీ కలిపి ప్రహసనాలు అరవైని మించి ప్రకటించాడు. పొలకువ తెలియని పూర్వకవి కావ్యాలు ప్రభావతీ ప్రద్యుమ్నం, రామాభ్యుదయం, జైమినీ భారతం, ప్రబోధ చంద్రోదయం, ఉత్తర హరివంశం, విజ్ఞానేశ్వరం, మొల్ల రామాయణం మొదలైనవి ఇరవైని మించి, మొట్టమొదటిసారిగా తాళపత్రాలనుంచి పరిష్కరించి ప్రకటించాడు.

చనిపోతున్నప్పుడుకూడా, కవుల చరిత్ర ద్వితీయ భాగపు ముద్రిత ప్రతి ప్రూపులు దిద్దుతూ, కలం చేతిలో పట్టుకొనే ఆయన అసువులు వీడాడని వీరేశలింగం కవి నిర్యాణం అన్న వ్యాసంలో శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు వ్రాశారు.

కథాశేషుడు శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావింట - ఎగ్మూర్, వేదవిలాస్‌లో కవుల చరిత్రను సంస్కరిస్తూ, కాలగతి చెందాడు వీరేశలింగం.

పదిమంది మహా రచయితలు కలిసి చేయలేని పనిని ఒక వీరేశలింగం నిర్వహించాడు. పందొమ్మిదో శతాబ్ది తెలుగు సాహిత్యమంతా వీరేశలింగ మహాశయుడి సాహిత్య మహావృక్ష శాఖోపశాఖా విస్తరణ చరిత్రమే. ఆయన అప్పటి కాలాన్ని ప్రభావితం చేశాడు. ఆయన చేపట్టని ప్రక్రియే లేదు.

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధంనుంచి నవ్యాంధ్ర వ్యాకరణంవరకు వీరేశలింగం సాహిత్య జీవితం నవరసోజ్జ్వలం.

# వీర సంస్కర్త

బసవరాజు గవర్రాజు, చల్లపల్లి బాపయ్య, చిర్రావూరి యజ్ఞన్న శాస్త్రి, బుర్రా రాజలింగం, ఏలూరు లక్ష్మీనరసింహం మొదలైన వాళ్ళంతా వీరేశలింగానికి ఆప్తమిత్రులు.

1874 అక్టోబరు నెలలో వివేకవర్ధని మొదటి సంచికను వీరేశలింగం విడుదల చేశాడు. ఆ తరువాత మిత్రులంతా కలిసి సంఘంలోని దురాచారాలు ఏ విధంగా రూపుమాపాలో అప్పుడప్పుడు చర్చించుకొనేవాళ్ళు. భోగం వాళ్ళకు వసూళ్ళు చదివించటం గూర్చి తీవ్రంగా వ్రాసి, తగు మనుష్యులు తలలు వంచుకొనేటట్లు చేశారు. తరువాత ఉద్యోగస్తుల లంచగొండితనంపైన దాడి చేశారు. ప్రజాక్షేమం నిమిత్తం పనిచేయవలసివస్తే స్వజాతివాడనీ, బంధువనీ, మిత్రుడనీ పరిగణించడం ఉండేదికాదు. అతి జాగ్రత్తగా సమాచారాన్ని సేకరించేవాళ్ళు. గురి తప్పకుండా కొట్టేవాళ్ళు. ఆశించిన ప్రతిఫలాన్ని రాబట్టేవాళ్ళు. వివేకవర్ధని కొన్నాళ్ళకు పక్షపత్రిక అయింది. కొన్నాళ్ళు వారపత్రికగాకూడా వచ్చింది.

> “ఆ కాలమునందలి రాజకీయోద్యోగులలోని లంచములు మొదలైన యకృత్యముల నణచుటకును కులములోని దురాచారములను మాన్పుటకును సంఘ సంస్కారములను దేశమంతటను వ్యాపింపజేయుటకును మా వివేకవర్ధనీ పత్రిక యమూల్యాయుధముగా నుండెను.” అన్నారు వీరేశలింగంగారే.

ప్రతిపక్షులు ప్రదర్శించగలిగినంత కోపాన్ని ప్రదర్శించారు. పెట్టగలిగినన్ని కష్టాలు పెట్టారు. కానీ వీరేశలింగం చలించలేదు. శుష్కోపన్యాసాలవల్ల ప్రయోజనం లేదని ఆయన గ్రహించాడు. కేవలం ప్రహసనాలవల్ల సాధించగలిగిందీ ఉండదని తెలుసుకొన్నాడు. తాము నమ్మిన సత్యాన్ని, సిద్ధాంతాన్ని లోకానికి ఆచరణ సాధ్యమేనని నిరూపించాలి, చేసి చూపాలి ఏదైనను ఒక మేలు.

బోగం వాళ్ళకు కట్నాలు చదివించే పద్ధతి మాన్పించటమూ, శాఖా భేదాలు తగవని బోధించటమూ, మూఢ విశ్వాసాలు సాంఘిక వికాసానికి వేరుపురుగులని నచ్చచెప్పటమూ కొంతకాలము జరిగింది.

ఇంతకన్నా తీవ్రమైన సాంఘిక సంస్కరణలు ఆచరణలోకి తేవాలి. ఆంతరంగిక మిత్ర సమాజమంతా కటిబద్ధులైనారు. స్త్రీ పునర్వివాహాలు, వాటి సాంఘికావసరాలకు అనుగుణమైనవే అని ప్రచారం చేయాలి. ముక్కుపచ్చలారని బాల వితంతువులకు అవశ్యం మళ్ళీ పెళ్ళి చేయాలి అని కూడబలుక్కున్నారు. నాయకత్వం వీరేశలింగానిది. అంతకుపూర్వం చెన్నపట్నంలో స్త్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజము ఒకటి తల ఎత్తింది. కాని, పనిమాత్రం చేయకుండా సమసిపోయింది. తెలుగుదేశంలో ధవళేశ్వరమనే చిన్న ఊళ్ళో వీరేశలింగమనే సంఘ సంస్కరణాభిలాషి ఉన్నాడన్న విషయం, చెన్నపట్నం సంఘ సంస్కరణ సమాజంవాళ్ళు గుర్తించలేదు.

1878 సెప్టెంబరు 8వ తేదీ రాజమహేంద్రవరంలో మిత్రులతో కలిసి వీరేశలింగం సంఘ సంస్కార సమాజం స్థాపించాడు. ఆ సమాజంలో వివిధ విషయాలను గూర్చి వీరేశలింగం ఉపన్యసించేవాడు.

రాజమండ్రిలో చిత్రపు కామరాజనే గవర్నమెంటు ప్లీడరు, పోలూరి శ్రీరాములనే డిస్ట్రిక్టు మున్సబూ కలిసి, న్యాయస్థానాన్ని లంచాల శాలగా మార్చారు. దాని విషయమై వీరేశలింగం వివేకవర్ధనిలో వ్రాశాడు. ప్రభుత్వంవారు విచారణ జరిపించారు. గవర్నమెంటు ప్లీడరు తన నేరం రుజువు కావటంతో ఆత్మహత్య చేసుకొన్నాడు. క్రిమినల్ రికార్డుకీపరైన బొల్లాప్రగడ వెంకన్నగారిదీ, సిరస్తదారైన రొజారియో అనే యూరోపియన్‌దీ ఉద్యోగాలు ఊడిపోయినాయి. ఈ విచారణ బందరులో జరిగింది కొన్నాళ్ళు. ఈ రోజుల్లోనే అంటే 1878 సెప్టెంబరు 22వ తేదీన వీరేశలింగాన్ని కనిపెంచిన తల్లి పున్నమ్మ కీర్తిశేషురాలైంది. ఇన్ని కష్టాలలో దుఃఖాలలోకూడా వీరేశలింగం పూనిన పనిని విడిచిపెట్టలేదు. ఆ సంవత్సరం డిసెంబరు నెలలో వివేకవర్ధనిలో ఆయన ఇట్లా వ్రాశాడు:

> "మేమీ పనిని (పత్రికా ప్రకటనమును) పూనుకొనుట దేశముయొక్కయు ప్రజలయొక్కయు క్షేమలాభములకొరకే కాని ధనలాభమున కాశపడికాదు. లౌక్యాధికార ధూర్వహులయియున్న కొందరి దుశ్చేష్టలను వెల్లడి చేయటమువలన అట్టివారు మాకు శత్రువులుగా నేర్పడిరి. అయినను ఒకరి యనుగ్రహమున కపేక్షపడిగాని ఒకరి నిగ్రహమునకు వెఱచిగాని పత్రికా విలేఖత్వము ననుసరించి మాకు విధిగా నేర్పడిన కృత్యము నుండి తొలగకుండుట మా పూనికగాన, కొందరితో విరోధపడియైనను జనసంఘమునకు మేలు చేయగలిగితిమి గదాయని యానందించుచున్నాము."

ఒక సందర్భములో వివేకవర్ధనిని గూర్చి చెపుతూ 'వివేకవర్ధని పేరే భయంకరమై దుష్టాధికారులకు గర్భనిర్భేదక మయ్యెను' అన్నాడు.

వీరేశలింగం ముఖ్యంగా రెండు రంగాలలో గొప్ప కృషి చేశాడు. ఒకటి స్త్రీ విద్యావ్యాపనం. రెండు వితంతు వివాహాలు. ఇక మూఢవిశ్వాసాలు తొలగించడం, కులాచారాలు సంస్కరించడం, ఏకేశ్వరోపాసనం ప్రచారం చేయడం, భూతప్రేతాలను గూర్చి యధార్థ జ్ఞానం కలగజేయడం, ప్రార్థనా మందిరాలు నిర్మించడం, పాఠశాలలు నెలకొల్పడం మొదలైనవి ఆయన ప్రధానంగా పనిచేసిన సంస్కరణలకు సహాయకంగా ఉన్నాయి.

1879 ఆగస్టు 3 వతేదీ వీరేశలింగం, వితంతు వివాహం శాస్త్ర సమ్మతమే అంటూ రాజమండ్రిలో మొట్టమొదట బహిరంగోపన్యాసం చేశాడు. దానితో ఆంధ్రదేశమంతా సంక్షోభం చెలరేగింది. వాదోపవాదాలు చెలరేగాయి. ఖండన గ్రంథాలు ఎందరో వ్రాసి ప్రచురించారు. వీటన్నిటికీ సమాధానంగా అదే సంవత్సరం అక్టోబరు 12వ తేదీన వీరేశలింగం రెండో ఉపన్యాసం చేశాడు. తమ సిద్ధాంతాలను పండితసభల్లో వాదించి నిలబెట్టుకోలేక వీరేశలింగాన్ని చుట్టుముట్టి కొట్టి కసి తీర్చుకొందామనుకొన్నారు ప్రతిపక్షాలవాళ్ళు.

రాజమండ్రిలో ఒకసారీ, కాకినాడలో ఒకసారి ఇట్లా జరిగింది. రెండుసార్లూ ఆయన్ను విద్యార్థులు కాపాడారు. మద్రాసులో ఒకసారి ఇట్లా జరిగింది. పనప్పాకం అనందాచార్యులుగారు, తమబండిలో ఎక్కించుకొని తీసుకొనివెళ్ళి వీరేశలింగాన్ని రక్షించవలసి వచ్చింది. విద్యార్థులాయనను కంటికి రెప్పలా కాపాడారు. ఏ పని చెప్పినా వెంటనే నిర్వహించేవారు. యువతరమే ఆయనకానాడు కొండంత బలం. వాళ్ళ అండదండలే ఆయన కార్యనిర్వహణ కెంతగానో తోడ్పడ్డాయి. వీరేశలింగం బోధనలు విని యువతరం చాలా ఉత్తేజాన్ని పొందింది. ఆయన ప్రారంభించిన సంఘ సంస్కరణలన్నింటిలో యువకులు ముందున్నారు. వితంతువులను వివాహమాడతామని విద్యార్థులు ముందుకు వచ్చారు. విరూపాక్ష పీఠాధిపతుల లోపాలన్నీ విద్యార్థులే బట్టబయలుచేసి రాజమండ్రిలో వారికి ఉప్పు పత్రీ పుట్టకుండా చేశారు. సమాచారాలను సేకరించడంలోనూ, వాటిని అందించవలసిన వాళ్ళకు అందించి రావడంలోనూ, విద్యార్థులు వీరేశలింగాని కెంతగానో తోడ్పడ్డారు. నిప్పులోకి ఉరకమన్నా, నూతిలోకి దూకమన్నా సరేనని వాళ్ళు సిద్ధంగా ఉండేవాళ్ళని వీరేశలింగమే వ్రాశాడు.

చందాలు వసూలుచేసి రాత్రి పాఠశాలలు నిర్వహించి, కూలినాలి చేసుకొని పొట్టపోసుకొనే వాళ్ళకు చదువులు నేర్పారు. ప్రార్థనా సమాజ కార్యకలాపాలలో అత్యుత్సాహంగా పాల్గొనేవాళ్ళు. నిర్మాణ కార్యక్రమాలన్నింటిలో చేయూతనివ్వడానికి సంసిద్ధమే. చల్లపల్లి బాపయ్య, బసవరాజు గవర్రాజు వంటి కార్యశూరులు, సాహసులు, సంఘ సంస్కరణోత్సాహులు ఇంటింటికీ తిరిగి, స్త్రీ పునర్వివాహాలు జరిగితే భోజనానికి వచ్చే వారి పట్టికను సిద్ధం చేశారు. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు అప్పుడు రాజమండ్రిలో డిస్ట్రిక్టు మున్సిఫ్. న్యాపతి సుబ్బారావు కొత్తగా ప్రాక్టీసు పెట్టాడు. ఏలూరు లక్ష్మీనరసింహం పాఠశాలోపాధ్యాయుడు సంఘ సంస్కరణ కార్యక్రమాలపట్ల అత్యంతాభినివేశం చూపేవాడు.

అంతరంగిక మిత్రమండలి సమావేశమై, వితంతు వివాహాలు జరపటానికి నిశ్చయించింది. అయితే పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ కావాలి. వీరేశలింగం స్త్రీ పునర్వివాహ విషయమై వర్ణించిన సన్నివేశాలు ఏ అపరాధ పరిశోధక ఇతివృత్తానికీ తీసిపోవు. ఎదుర్కొన్న సాధక బాధకాలు రాత్రిళ్ళు ప్రయాణం చేయడం, ఊరూ పేరూ చెప్పకపోవడం, ఆడపిల్లలకు మగవేషాలు వెయ్యటం, మైళ్ళకొద్దీ వాళ్ళను ఎత్తుకొని నడవటం, పగటిపూట దాక్కోవడం, రహస్యంగా ఉత్తరాలందించటం, ఇంటికి చేరిన బాల వితంతువులను కడుపులో పెట్టుకొని కాపాడటం, వితంతువుల బంధువులు, సంరక్షకులు ఫిర్యాదులుచేస్తే, అభియోగాలు తెస్తే పోలీసు అధికారుల చుట్టూ తిరిగి, వాటి బాధలు తప్పించుకోవడం, ఇవన్నీ సాహస గాథలు. ఊపిరి బిగబట్టి చదివే సంఘటనలు. ఉత్కంఠ కలిగించే సన్నివేశాలు.

చిత్రవిచిత్రమైన మానవ ప్రకృతులు. అసూయలు, బలహీనతలు, ఆత్మవంచనలు, అహంభావాలు, దాంభిక ప్రదర్శనలు, సహాయం చేస్తామని ముందుకు వచ్చినవాళ్ళే, మాట ఇచ్చినవాళ్ళే, కావలసిన సమయానికి కూడిరాకపోవడం, పైపెచ్చు ఎన్నో చిక్కులు కలిగించడం, వంచన చేయటం ఇవన్నీ అనుభవించాడు వీరేశలింగం. అప్పటి పరిస్థితులలో






శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు

పంతులుగారు

రాజమహేంద్రవరములో

నిర్మింపజేసిన

"పురమందిరము"





రాజమహేంద్రవరములో

పంతులుగారు

జన్మించిన

పితృగృహము



ఇన్నీసుపేట పార్కులో
ప్రజలు నిర్మింపజేసిన
శిలాప్రతిమ



ఆనందోద్యానవనములో పంతులుగారు నివసించిన మేడ
దీనిని మ్యూజియముగా మార్చే ప్రయత్నము జరుగుచున్నది



## ఆదర్శదంపతులు

**వీరేశలింగం**

జననం-16-4-1848

మరణం-27-5-1919

**రాజ్యలక్ష్మమ్మ**

జననం-17-11-1851

మరణం-11-8-1910



మద్రాసులో శ్రీ పంతులుగారు నిర్మింపజేసి,

పరమ పదించిన మందిరము "వేద విలాస్", మైలాపూర్

అడుగు ముందుకు వేయడమే కష్టం. అటువంటిది సంఘ సంస్కరణ ప్రయాణంలో మైళ్ళు ముందుకు నడిచాడు. మైలురాళ్ళు స్థాపించాడు.

పైడా రామకృష్ణయ్యగారు కాకినాడలో సంపన్న గృహస్థు, సజ్జనుడు, ఉత్తమ సంస్కారి, ఆధునిక భావాలు కలవాడు. వీరేశలింగానికి అండగా నిలబడ్డాడు. తన జీవితకాలంలో ముప్ఫైవేలదాకా వితంతు వివాహాల నిమిత్తం ధన సహాయం చేశాడు. అయినా ఆయన కొసవరకూ పోరాడలేకపోయినాడు. ఎన్నో వత్తిడులు, అంతర, బాహ్య సంఘర్షణలు, కులభయం, వెలిభయం, ప్రాయశ్చిత్తం చేసుకొన్నాడు. వీరేశలింగానికి అత్యంత ఆప్తులే ఆయనను విడిచిపెట్టారు. కొందరు వ్యతిరేక ప్రచారంకూడా చేశారు. ఆనాటి సాంఘిక పరిస్థితులటువంటివి. అయినా వీరేశలింగం జంకలేదు.

కృష్ణాజిల్లా, రేపూడి గ్రామం. రాజమండ్రినుంచి బయలుదేరి రేపూడి వెళ్ళి బాల వితంతువు పన్నెండేళ్ళ పిల్లను తీసుకొని రావడానికి పన్నెండు రోజులు పట్టింది. సోమంచి భీమశంకరం కార్యసాధకుడు. ఆ పిల్లను తీసుకొని వచ్చాడు. ఇరవై రెండేళ్ళ గోగులపాటి శ్రీరాములు వరుడు. పన్నెండేళ్ళ గౌరమ్మ వధువు.

1881 డిసెంబర్ 11వ తేదీ శుభలగ్నం. సంస్థానాధిపతుల ఇంట జరిగే పెళ్ళిళ్ళకన్నా మహావైభవంగా జరిపించారు ఈ పెళ్ళి. వీధిలోనూ ఇంటి చుట్టూ పోలీసులు కాపలా వున్నారు. పెద్ద పెద్ద యూరోపియన్ అధికారులెందరో పల్లకీ వెంట పెళ్ళి ఊరేగింపుతో నడిచారు. బోగం మేళంకూడా ఉంటేకాని శోభ లేదన్నారు. పెళ్ళి జరిగినట్లు కాదన్నారు. సంఘాన్ని జయించినట్లు కాదన్నారు. సాంఘికామోదముద్ర పడదన్నారు. ఆ వెలితి ఎందుకన్నారు. ధనసహాయం చేసే రామకృష్ణయ్య, బోగంమేళంకూడా తప్పకుండా ఉండవలసిందేను అంటున్నాడు అన్నారు. విధిలేక వీరేశలింగం అంగీకరించాడు. బహు జనాభిప్రాయం. ఇది పదిమందినీ కూడగట్టుకొని రావలసినపని. 'సరే మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి. అయితే భోగం మేళం వాళ్ళు మా ఇంటిగడప ఛాయలకైనా రావటానికి నేనొప్పుకోను' అని ఖండితంగా చెప్పాడు. అట్లా అయితే ఊరేగింపులో పెడతాం, అన్నారు. ఆ విధంగా అది నాలుగురోజుల పెళ్ళి జరిగింది. చేస్తానని చెప్పిన దానిని చేసి చూపాడు. తెలుగుదేశంలో మొట్టమొదటి వితంతు వివాహం జరిగింది.

నాలుగు రోజులకే కన్నకడుపుకనక తండ్రికికూడా చెప్పకుండా, తన పన్నెండేళ్ళ కూతురిని తీసుకొని ఒక తల్లి వచ్చింది. తన పిల్లరాత చెడింది తలరాత చెరిపి తిరిగి రాయమని వీరేశలింగాన్ని కోరింది. శుభస్య శీఘ్రం అన్నాడు వీరేశలింగం. వెంటనే పెళ్ళి జరిపించాడు. నాలుగురోజులు వ్యవధానంలోనే ఇద్దరు బాల వితంతువులకు మళ్ళీ మంగళసూత్రాలు కట్టించాడు. ఈ పెళ్ళికూడా మహావైభవంగా జరిగింది.

అయితే ఏం! ఊరివాళ్ళు ఏం చేశారో చూడండి – "ఈ శుభ కార్యములయందు కొంచెము సంబంధమున్న వారినందరిని వారి కాపురమున్న యద్దె ఇండ్లలో నుండి లేవగొట్టిరి. కాపురముండుట కెవ్వరు నిండ్లనియ్యకుండిరి. నూతులలో నీళ్ళు తోడుకోనియ్యకపోయిరి. నీళ్ళు తెచ్చు బ్రాహ్మణులను లేకుండ జేసిరి. శుభాశుభ కార్యములకు పురోహితులను బ్రాహ్మణులను రాకుండ జేసిరి. దేవాలయములకు

పోనియ్యకపోయిరి. బంధువులు మొదలైన వారిని వారి యిండ్లకు పోకుండ జేసిరి. కనపడినచోట్ల మొగము ముందరనే తిట్టసాగిరి."

సుమారు ఒక శతాబ్దం కిందటి సాంఘిక చరిత్ర ఇది.

ఉత్తుంగ తరంగితమైన సముద్రంలో ఎదురీత వంటిది వీరేశలింగం చేసిన పని. ఇళ్ళనుంచి వెళ్ళగొట్టిన వాళ్ళంతా వీరేశలింగం ఇంటిమీద వచ్చి పడ్డారు. వాళ్ళందరినీ ఆదరించవలసి వచ్చింది. నాయనమ్మ కూడా ఇంటినుంచి వెళ్ళిపోయి వేరింట కాపరం పెట్టింది. తల్లి లేనేలేదు. తండ్రి లేనేలేదు. ఇల్లాలికికూడా సహకరించవద్దని ఎందరో హితబోధ చేశారు. కాని "ఉత్తమా ఇల్లాలు" వాళ్ళ మాటలు చెవిని పెట్టలేదు. అన్ని విధాలా భర్తకు అండదండలుగా నిలిచింది. ఈ రెండు పెళ్ళిళ్ళూ కాగానే వీరేశలింగానికెన్నో అభినందన లేఖలు వచ్చాయి.

రాజధానీ నగరానికి వచ్చి ఉపన్యాసాలిచ్చి, సంఘ సంస్కరణ కార్యక్రమాన్ని నడిపించవలసిందిగా ఎందరు పెద్దలో ఆహ్వానించారు. వీరేశలింగం చెన్నపట్నం వెళ్ళాడు. ఉపన్యాసాలు చేశాడు. కులభేదాన్ని పాటించని విందులో పాల్గొని, మళ్ళీ రాజమండ్రి వచ్చాడు.

ఏడాది గడిచిపోయింది. మూడో వివాహం జరపలేకపోయినాను ఎట్లా? అని కలతచెందాడు. తీవ్రమైన ప్రయత్నాలు చేశాడు. అదివరలో సుముఖులుగా ఉన్న వాళ్ళుకూడా ఇప్పుడు విముఖులైనారు. అందరూ చాలా భయపడిపోయినారు. ధన సహాయం చేసిన పైడా రామకృష్ణయ్య, అనేక విధాల ఎంతో ప్రోత్సాహమిచ్చి తోడ్పడిన ఆత్మూరి లక్ష్మీ నరసింహం వంటి విద్యాధికులే ప్రాయశ్చిత్తాలు చేయించుకొన్నారు.

అయినా ఎంతో శ్రమపడి మూడో వితంతు వివాహం నిర్వహించాడు వీరేశలింగం. మొదటి రెండు వివాహాల మాదిరిగానే మహావైభవంగా జరిపించాడు. సనాతనులకు, ప్రతిపక్షులకు కడుపు మండిపోసాగింది. పెళ్ళి ఊరేగింపుమీద రాళ్ళు రువ్వారు. అయినా వీరేశలింగం సహించాడు.

అటు తరువాత నాలుగో వితంతు వివాహం నిర్వహించాడు. ఐదోది నిర్వహించాడు. వంట బ్రాహ్మణులు సహాయ నిరాకరణం చేశారు. ఎవరూ రాలేదు. రాజ్యలక్ష్మమ్మ గోదావరికి వెళ్ళి నీళ్ళు మోసుకొని తేవాల్సి వచ్చింది. పెళ్ళివారికి వంటచేసి పెట్టవలసి వచ్చింది. ఆమె వీరేశలింగానికి తగిన ఇల్లాలు.

ఏడో వివాహం జరిగే కాలానికి, రాజమండ్రి ప్రజలందరికీ వితంతు వివాహాలు అలవాటుపడి, పాతపడిపోయినాయి. రక్షకభటుల అవసరం లేకపోయింది. విద్యార్థులు మాత్రం సహాయంగా పెళ్ళి పల్లకి వెంట నడిచారు.

మూడేళ్ళలో మొత్తం పన్నెండు వితంతు వివాహాలు జరిపించాడు. అంటే మొదలు పెట్టిన నాటినుంచీ సుమారుగా మూణ్నెల్ల కొకటి నిర్వహించాడన్న మాట. ఇందులో కొన్ని చెన్నపట్నంలో నిర్వహించాడు. గొప్ప గొప్ప ప్రభుత్వాధికారాలలో ఉన్నవాళ్ళు, విశేషించి సంపన్నులు, సాంఘికంగా బలవంతులూ అయిన సంఘసంస్కార పక్షావలంబకులే ఎందరో ప్రాయశ్చిత్తాలు చేయించుకొని వీరేశలింగాన్ని విడిచివేశారు.

ఆయన పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించిన అభిమానపుత్రుడే ప్రాయశ్చిత్తం జరుపుకొన్నాడు. కన్న ప్రేమకన్నా పెంచిన మరులు మిక్కుటంకదా. రాజ్యలక్ష్మమ్మగారు చాలా బాధపడి ఉంటుంది. ఎంతగానో పరితపించింది. అయినా వీరేశలింగం చలించలేదు.

మూడో వితంతు వివాహం కాగానే కలకత్తానుంచి ఈశ్వరచంద్ర విద్యాసాగరులు వీరేశలింగానికి అభినందన సందేశం పంపించారు. ఒక్క తెలుగుదేశంలోనే కాక, దక్షిణ దేశమంతటను వీరేశలింగం పేరు ప్రఖ్యాతి పొందింది.

ఈ విధంగా స్త్రీ పునర్వివాహోద్యమాన్ని నడిపిస్తూనే, సమస్త ప్రజాహిత కార్యకలాపాలలో వీరేశలింగం ముందు నిలుస్తూ వచ్చాడు. గ్రంథ రచన నిరంతరాయంగా కొనసాగిస్తూనే వచ్చాడు. కొత్త కొత్త విరోధాలతో, బలవంతులైన విరోధులతో ఢీకొంటూ వచ్చాడు. స్త్రీ పునర్వివాహ సమాజంకోసం చందాలు వసూలు చేయటానికి వివిధ ప్రాంతాలు సందర్శిస్తూ వచ్చాడు. పురపాలక సంఘ కార్యకలాపాలలో ప్రధానపాత్ర వహిస్తూ వచ్చాడు. తనకు ధర్మమని న్యాయమని తోచినప్పుడు యూరోపియన్లే అయినా పెద్ద పెద్ద అధికారులే అయినా ఏ మాత్రమూ లక్ష్యపెట్టలేదు. రాజమహేంద్రవరం అభివృద్ధికి సంబంధించి పురపాలక సంఘ సభ్యులూ, అధికారులూ కలిసి రాకపోయినా, పురపాలక సంఘాధ్యక్షులే వ్యతిరేకించినా, వీరేశలింగం పట్టు విడవకుండా, తాను అధ్యక్ష ప్రతినిధిగా ఉన్న కాలంలో, ఎంతో పనిచేసి చూపించాడు.

ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారి వంటి ఆప్తులు విరోధులైనారు. న్యాపతి సుబ్బారావుగారి వంటి మిత్రులతో వైమనస్యం సంభవించినది. ఏలూరి లక్ష్మీనరసింహం గారి వంటి సహాయులతో వైరం వచ్చింది. బసవరాజు గవర్రాజు వంటి ప్రాణమిత్రులు పరలోకగతులైనారు. ఒంటరివాడైనాడు. అయినా అహర్నిశలూ భాషాభివృద్ధికే, దేశాభివృద్ధికే కృషి చేశాడు.

'వీరేశలింగంగారికి ప్రఖ్యాత రచయిత వాల్టేరుతో సరిసమాన స్థానాన్నివ్వవచ్చు. వాఙ్మయం ఆయన సేవాపత్రానికి ఆయుధంలా పనిచేయగలిగింది. ప్రఖ్యాత గ్రీకు గ్రంథకర్త హెయిను తన సమాధిపైన ఆయుధాన్ని చిత్రించమని కోరాడు. వీరేశలింగంగారి స్మరణ చిహ్నంగా, గౌరవార్థంగా ఆయుధాన్ని దేన్నైనా ఉంచడం మంచిది, ఆయన సమాధిమీద' అని వ్రాశారు కట్టమంచి రామలింగారెడ్డి. మీరు వృద్ధులైనారంటే వీరేశలింగంగారికి చాలాకోపం వచ్చేదట. సహించేవాడు కాదట – రామలింగారెడ్డిగారే వ్రాశారు. మానసికంగా వీరేశలింగం ఎప్పుడూ నిత్య యవ్వనుడు. సమధిక కార్యోత్సాహశీలి. ఆయన జీవిత కాలమంతా అట్లానే గడిచింది.

# యుగపురుషుడు

**వీ**రేశలింగం యుగపురుషుడా!

సదసత్సంశయం.

అవునా! కాదా?

ఎవరిని యుగపురుషుడనాలి.

యుగపురుషుని లక్షణాలేమిటి?

వీరేశలింగం సమకాలీన సమాజాన్ని ప్రభావితం చేసిన మాట నిజమే. అయితే మానవ ప్రకృతిని ఏ మాత్రం అర్థం చేసుకున్నాడు. ఎంతవరకు శాసించగలిగాడు?

ఆయన మహాపురుషుడు. ఏ మాత్రం సందేహంలేదు. చెప్పినదానిని చేసి చూపాడు. ఆత్మవంచన చేసుకోలేదు ఏనాడూ. తన లోపాలు కూడా వెల్లడించుకొన్నాడు. తన బలహీనతలనుగూర్చి ప్రస్తావించాడు. తాను దేనినైతే విశ్వసించాడో దానికోసమే త్రికరణ శుద్ధిగా పాటుపడ్డాడు. స్వార్థమన్న దానిని దగ్గరకు చేరనివ్వలేదు. ధన విషయికంగా, కీర్తి ప్రతిష్ఠలకు సంబంధించీ, స్వార్థాన్ని ఎప్పుడూ దూరంగానే ఉంచాడు. సన్నిహిత మిత్రులే అయినా వాళ్ళ లోపాలు వెల్లడి చేయటానికి ఏ సందర్భంలోనూ సంకోచించలేదు. నమ్మకాల విషయంలో ఏనాడూ ఎవరితోనూ రాజీపడలేదు. ఉపేక్షించలేదు. మానవ సహజమైన దౌర్బల్యాలను అంగీకరించాడు. కాని సంఘానికి చెరుపుచేసే వాటిని క్షమించలేకపోయినాడు.

నూరేళ్ళనాటి సాంఘిక పరిస్థితులను బాగా అర్థం చేసుకొంటే కాని వీరేశలింగం సాధించినది ఏమిటో అర్థంకాదు. ఆయన సుమారు నలభై వితంతు వివాహాలు నిర్వహించటం కాదు ఆయన గొప్పతనం. నూటికి మించి గ్రంథాలు వ్రాయటంకాదు, ఆ గ్రంథాలన్నీ శాశ్వతంగా నిలిచిపోయేవీకావు. ఉజ్జ్వలమైన కళారూపాలూ కావు. నూరేళ్ళకే ఆ గ్రంథాలు పాతపడిపోయినవి. ఆ పరిస్థితులెన్నో మారిపోయినవి. అగ్గిపెట్టెలు వాడుకలోకి రాకముందు నిప్పు ఎట్లా రాజేసుకొనేవారో తెలుసుకొంటే ఆశ్చర్యమనిపించక మానదు.

అట్లానే నూరేళ్ళ కిందట పూటకూళ్ళమ్మ దండెం మీద తడి బట్టలు ఆరవేసి, పూటకూటి భోజనానికి వచ్చే వాళ్ళకు అందించటం, ఏ చిలకమర్తి నవలల్లోనో చదివితే, ఆపుకున్నా ఆగని నవ్వొస్తుంది. మూడేళ్ళకే, నాలుగేళ్ళకే ఆడపిల్లల పెళ్ళి చేయడం, వ్యక్తురాండ్రు కాకుండానే పెళ్ళి చేయాలని సాంప్రదాయ కుటుంబీకులు వెంపర్లాడడం, అవన్నీ ఏనాడో గడిచిపోయిన గాథలైనాయి. వీరేశలింగం పుస్తకాల్లో వ్రాసిన విషయాలుకూడా ఈ రోజు మనకు విచిత్రంగానే కనిపిస్తాయి. నమ్మశక్యం కానట్టుగానూ ఉంటాయి. ఆ విషయాలే ఆయన వ్రాశాడు.

అదీకాక వీరేశలింగం గొప్ప బోధకుడే కాని, ప్రతిభాశాలియైన కళాకారుడుకాదు. ఆయన అనువాదాలు ఒక్కొక్కచోట చేయి తిరగని ప్రాథమికుడి రచనల్లాగే ఉంటాయి. ఔత్సాహికుడి ప్రథమ ప్రయత్నాలవలెనూ ఉంటాయి. ఆయన వ్రాసిన మౌలిక రచనలట్లా

వుండవు. వాటిలో కూడా సంఘ సంస్కరణము గూర్చిన ప్రస్తావన వచ్చిందా, ఆయనకు పూనకం లాంటిది వస్తుంది. సమయం, సందర్భం, పాత్రల వయస్సు, ఔచిత్యం అన్నీ మరచిపోతాడు.

కొన్ని నవలలు మిడిసరుతే అనిపిస్తుంది యిప్పటి దృష్టితో చూస్తే. ఆయన కవుల చరిత్ర గొప్ప కృషి. శాకుంతలంవంటి అనువాదాలు ప్రతిభావంతంగా నిర్వహించాడు. ఉపన్యాసాల, వ్యాసాలశైలి యీనాటి శైలిముందు బాగా వెనకబడినదిగానే కనిపిస్తుంది. ఇక విగ్రహం, నంధి విషయం ఏనాడో విస్మృతమైనట్లుగానే లెక్క.

రాజశేఖర చరిత్రలాంటి నవలలు ఎవరైనా తిరిగి వ్రాస్తే బాగు. ఆయన నవ్యాంధ్ర వ్యాకరణం ఆసాంతం రచించివుంటే ఎట్లా వుండేదో! మరి గ్రంథకర్తగా కాక, వీరేశలింగం గొప్పతనం ఎటువంటిది? ఆయన వ్యక్తిత్వం చాలా గొప్పది. కోటికొక్కరైనా ఉంటారో ఉండరో, అటువంటి మూర్తిమంతం ఉన్నవాళ్ళు.

వీరేశలింగం సమకాలికులలో ఆయనకన్నా గొప్ప పండితులున్నారు. కవులున్నారు. సాహిత్య మర్మం తెలిసిన రచయితలున్నారు. పరవస్తు వేంకటరంగాచార్యులు, కొక్కొండ వేంకటరత్నం, వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి! ధర్మవరం కృష్ణమాచార్యులు, వావిలికొలను సుబ్బారావు, పూండ్ల రామకృష్ణయ్య మొదలైన వాళ్ళంతా ఎన్నదగ్గవాళ్లే.

అటు తరువాత బయల్దేరిన తిరుపతి వేంకటకవులు కవిత్వంలోనూ, పాండిత్యం లోనూ గొప్పవారే.

అయితే వీరేశలింగం ఘనత ఎటువంటిది?

గాంధీజీ ఘనత వంటిది!

గాంధీజీ సమకాలికులలో మాత్రం మహామహులెందరు లేరు. అనర్గళంగా వాక్ప్రవాహాలు పారించగల ఉపన్యాస ధీరులు లేరా? ఆధ్యాత్మిక సంపన్నులున్నారు కదా! అతిశయించిన పాండిత్యం ఉన్న వాళ్ళూ ఘనవిద్వాంసులున్నారు. త్యాగశీలురున్నారు. ధనవంతుల సంగతి చెప్పవలసిన పనిలేదు.

మరి గాంధీ మహాత్ముడెట్లా అయినాడు? ఆయన ఉరుములు ఉరిమినట్లూ, మెరుపులు మెరిపినట్లూ ఉపన్యసించగల నేర్పరి కాదే? మహా రచయిత అని చెప్పటానికి ఆయన గ్రంథాలెన్ని వ్రాశాడు? అయినా ఆసేతు శీతాచలం, ఆయన మాట వ్యాపించింది. ఆయన వాక్కుకు ఎక్కడలేని బలిమి వచ్చింది. అందరూ తల దాల్చారు. అనుసరించారు. ఆయనను ఆరాధించారు. అవతార పురుషుడన్నంతవరకూ కొనసాగింది ఆరాధన.

ఎందువల్ల ఆయన ఇంతటి మహాత్ముడైనాడు? క్రీస్తుకన్నా గొప్ప విషయాలు బోధించాడా? బుద్ధునికన్నా పరమార్థం విప్పి చెప్పాడా? గాంధీగారు బోధించిన సిద్ధాంతాలు, ఆచరణసాధ్యాలా అనికూడా నేడు అనేకులకు అనుమానాలు రావచ్చు. కళ్ళముందు కనబడుతున్న చరిత్రే వెల్లడిస్తున్నది. అయినా గాంధీజీ నాడు భారతదేశాన్ని అంతటినీ ప్రభావితం చేశాడు. దీనికి ఒక్కటే కారణం. త్రికరణశుద్ధి! ఆయన స్వార్థరహితుడు. దేనినైతే నమ్మాడో, చెప్పాడో దానినే అనుసరించి చూపాడు. గొప్ప

ఆత్మబలం ఉన్నవాడు, అందుకనే కారాగారాలు, ప్రభుత్వ శాసనాలు ఆయన్ను ఏమీ చేయలేకపోయినవి.

గొప్ప త్యాగి గాంధీజీ. వీరేశలింగంలోకూడా ఇటువంటి త్యాగగుణమే ఆయన్ను ఘనుడిని చేసింది. ఆయన స్వార్థ రాహిత్యమే ఆయన్ను గొప్పవాణ్ణి చేసింది. ఆయన పట్టుదల, మానవత్వంపైని ప్రగాఢమైన నమ్మకమూ, 'పనిచేసి చూపవలెననే చింతా' వీరేశలింగాన్ని మహాపురుషుణ్ణి చేశాయి. ఆయన ధైర్యానికి అవధులు లేవేమోననిపిస్తుంది. ఎటువంటి విపత్కర పరిస్థితులలోనూ వెరపెరుగని వీరుడాయన. తనకు కించిత్తైనా ప్రయోజనం లేకపోగా, పైగా అష్టకష్టాలూ అనుభవించవలసి వచ్చినా, సామాజిక దురన్యాయాలను ఎదిరించడం, వాటికి ప్రతిక్రియ పుట్టేవరకూ పట్టుదలతో పోరాడడం మహాపురుష లక్షణమైతే వీరేశలింగం మహాపురుషుడు యుగపురుష లక్షణమైతే యుగపురుషుడు.

ఎవరికోసం కష్టాలు అనుభవించాలి? సామాన్యంగా తమ కోసమైనా సరే కష్టాలనుభవించటానికి అంగీకరించరు. వెనుకంజ వేస్తారు లోకసామాన్యులు. అటువంటిది అజ్ఞానానికి, మూర్ఖత్వానికి, కరడుకట్టుకొనిపోయిన స్వార్థానికి, సంకుచి తత్వానికి ఎదురునిలిచి, బాధలను బాధలనుకోక, లక్ష్యపెట్టక పోరాటం సాగించటం సామాన్యంకాదు. వీరేశలింగం సరిగ్గా అదే చేశాడు.

తన కాలంలో మాన్యులను, సామాన్యులను, మేధావులను, నాయకులను కూడా ఆయన ప్రభావితం చేశాడు. నైతికబలం ఆయనకు అపారం. అదే వీరేశలింగం ఆత్మబలం. సాహిత్య రంగంలోనూ, సాంఘిక రంగంలోనూ ఆధునిక భావాలను పరిచయం చేయడం సులభం కాదు.

వీరేశలింగం నాటికి సాహిత్యమంటే పద్య కావ్యాలే. అష్టాదశ వర్ణనలూ, అలంకారాలు సమాజ జటిలత్వం కావ్యమన్న తరవాత తప్పనిసరిగా ఉండాలి. ఉపజ్ఞగూర్చి పట్టింపులేదు. అప్పటి సాహిత్యమంతా పండితులకు మాత్రమే. సంఘంలో అక్షరాస్యత కూడా తక్కువగానే ఉండేది. అందువల్ల రచనలలో వైవిధ్యంలేదు. ఈ విధంగా ఇంచుమించుగా పంధొమ్మిదో శతాబ్దం తొలిపాదందాకా సాగింది. అంతకుపూర్వం నాలుగైదు వచన కావ్యాలున్నా, యక్షగానాలు అధిక సంఖ్యలోనే ఉన్నా, స్థలమహత్యాలు, చరిత్రలు ఉన్నా, అవి నిరాదరణ పాలైనాయి. జానపద సాహిత్యంకూడా నిరాదృతమే అయింది. అందుకే వీరేశలింగం ఇట్లా వ్రాశాడు –

> "నే నారంభించిన కాలమునందు తెలుగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములు లేవు వివిధము లేమి? ఇంచుమించుగా నేవిధమైనవియు వచన రూపమయినవి లేవనియే చెప్పవచ్చును. అప్పుడన్నియు నూతన సృష్టి చేయవలెను. అందుచేత నప్పటి వారికి కష్టము లెక్కువ. సౌలభ్యములు తక్కువ. అయినను తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేను వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే విరచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని."

ఈ వాక్యాలు ఉదహరించి వీరేశలింగానికి అసత్యదోషం అంటకట్టాలని కొందరు ప్రయత్నించారు. కాలక్రమాను పూర్విగా అంతకుముందే ఎవరో రచనలు చేశారట కదా? పుస్తకాలున్నాయట కదా అని ప్రశ్నిస్తారు. ఒకటీ అర ఉన్నమాట నిజమే కాని అవి లోకంలో ప్రచారానికి వచ్చి ఉండవు. లేదా వీరేశలింగంగారి దృష్టికి వచ్చి ఉండవు. వీరేశలింగానికీ తన జీవితంలో తాను సాధించిన గొప్ప పనులకన్నా, ఈ పుస్తక రచనా ప్రాథమ్యంపట్ల ఎక్కువ మక్కువ ఉంటుందనుకోవటానికి ఆస్కారంలేదు. అయితే ఎందుకిట్లా వ్రాశాడు? నాటి సాంఘిక స్థితిని, సాహిత్య స్థితినీ తెలియజేయటానికి మాత్రమే అనుకోవాలి. ఆ వాక్యాల కిందనే ఆయన ఇట్లా వ్రాశాడు-

"అయినను ప్రథమ ప్రయత్నము లెప్పుడును ప్రథమ ప్రయత్నములే. అవి దోష బహుళములయి యుండుట స్వాభావికము. మనము వృద్ధి పొందగలుగుట చేసిన తప్పులను బట్టియే కాబట్టి మొదట చేయబడిన నా పుస్తకములను తరువాతి వారి గురుతర పుస్తక రచనకు గొంత తోడుపడవచ్చును."

ఈ వాక్యములను బట్టే ముందుగా ఆయన చెప్పిన వాక్యాలలో ఆత్మశ్లాఘన దృష్టి ఆయనకు లేదని తేలిపోతుంది. ఆత్మశ్లాఘనం కోసం అసత్యం చెప్పదలచుకొంటే, ఆ బలహీనత నాయన కాపాడించదలచుకొంటే, అటు తరవాత వ్రాసిన కావ్యాల నాయన వ్రాసి ఉండేవాడు కాదు. ఆ విధంగా వీరేశలింగాన్ని విమర్శించదలచుకొన్న వాళ్ళకు ఇదే సమాధానం.

వీరేశలింగం తన కాలంలోనే కాక తరువాత తరాలనుగూడా ప్రభావితం చేశాడు, చేస్తున్నాడు. ప్రతిపక్షులు బాధలు కలుగజేసిన కొద్దీ మరింత దీక్షతో వాటిని ఎదుర్కొని మంచిని సాధించాడు.

వీరేశలింగాన్ని ఆదర్శంగా పెట్టుకొని నేనెన్నో నేర్చుకొన్నానని ఆంధ్రకేసరి ప్రకారం వ్రాశాడు. ఆయన పట్టుదలా, పనిచేసే విధానమూ, నేర్పూ రాజమండ్రిలో బాగా పరిశీలనగా గ్రహించి, వాటిని ఆదర్శంగా ఎంచుకొన్నానన్నాడు ప్రకాశం.

అఖిల భారత కాంగ్రెసు సభలలో పాల్గొని తిరిగివస్తూ పూనా నగరంలో మహదేవ గోవిందరనడే ధర్మపత్నీ మొదలైనవారు నడుపుతున్న వితంతు సంరక్షణ గృహాన్ని సందర్శించి, వారు చేస్తున్న పనిని శ్లాఘించగా ఆమె, 'కందుకూరి వీరేశలింగంగారు పుట్టిన దేశంనుంచి వచ్చిన మీరు మమ్మల్ని శ్లాఘించటం ఎంతమాట' అని వీరేశలింగాన్ని ప్రశంసించినట్లుగా కొండ వెంకటప్పయ్యగారు స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు.

దక్షిణ భారతదేశ బ్రహ్మ సమాజానికి ప్రధానాధ్యక్షుడుగా వీరేశలింగం కొంతకాలం పనిచేశాడు. మద్రాసులో జరిగిన సంఘ సంస్కరణ సమాజ మహాసభలో మహదేవ గోవిందరనడే అధ్యక్షతన, వీరేశలింగానికి దక్షిణ హిందూదేశ విద్యాసాగర బిరుదం సమర్పితమైనది. రఘుపతి వేంకటరత్నంగారితో కలిసి, వీరేశలింగం తన చివరి రోజుల్లో రాజమహేంద్రవరంలో విద్యారంగలో కృషి చేశాడు. బ్రహ్మసమాజ విషయికంగా, సంఘ సంస్కరణకుకూడా దేశరాజు పెదబాపయ్య, రఘుపతి వేంకటరత్నం మొదలైనవారి సహచర్యంతో వీరేశలింగం సాధించాడు. ఆయన కుల చిహ్నమైన యజ్ఞోపవీతాన్ని

విసర్జించి, సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని ప్రకటించాడు. కుల వివక్షతను నిరసించాడు. తనకు చాలా కాలంనుంచే ఇటువంటి సంకల్పంవున్నా, తాను చేపట్టిన సంఘ సంస్కరణ కార్యక్రమానికి అది ప్రతిబంధకంగా పరిణమిస్తుందేమోనన్న భయంవల్ల ఆచరణలోకి తీసుకొని రాలేదనీ, ఇక ఎంత మాత్రమూ లోకవంచకుణ్ణి కావటం ఇష్టంలేక వృద్ధ దశలో ఇటువంటి సాహసిక కార్యానికి పూనుకొంటున్నాననీ స్పష్టం చేశాడు.

తన సమాధిపైన 'యథార్థ ఏకేశ్వర విశ్వాసి' అని మాత్రమే లిఖించవలసిందిగా ఆయన కోరాడు. పండితుడనీ, కవి అనీ, సంఘ సంస్కరణలకోసం పాటుపడినవాడనీ వ్రాయడం ఆయన కిష్టం లేకపోయింది. ప్రార్థనా మందిరాలు, అగతిక మాతా శిశు సంరక్షణ శాలలు, బాలికా పాఠశాలలు, పురమందిరాలు, విద్యాలయాలు నిర్మింపచేశాడు. బాలబాలికల సహవిద్యా విధానాన్ని ప్రోత్సహించాడు.

హితకారిణీ సమాజమనే పేరుతో సాంఘిక కార్యకలాపాలకొక సమాజాన్ని స్థాపించి సుమారు ఏభైవేల రూపాయలు విలువచేసే తన స్థిర, చరాస్తులన్నిటినీ ఆ సంస్థకు అప్పగించిన మహోదార పురుషుడు వీరేశలింగం.

ఆ ధర్మసంస్థనుంచి లభించే సొత్తుతో వృత్తిశిక్షణనిచ్చే పాఠశాలలు, సాంకేతిక విద్యా పాఠశాలలు స్థాపించవలసిందని ఆయన కోరాడు. వంచితలైన స్త్రీలు తమ కాళ్ళమీద తాము నిలబడటానికి తగిన విద్యను వాళ్ళకు నేర్పటానికి, రాజమహేంద్రవరంలో వితంతు శరణాలయం స్థాపించాడు.

రాజమండ్రి, చెన్నపట్నం, బెంగుళూరు మొదలైన చోట్ల పురమందిరాలు, ప్రార్థనా మందిరాలు నిర్మించి, సమాజాని కంకితం చేయడం సామాన్య విషయం కాదు.

ఆయన వ్యక్తి మాత్రుడుకాదు. ఒక వ్యవస్థను సంపూర్ణంగా మార్చివేశాడు. అర్ధ శతాబ్ది కాలంలో తన కళ్ళముందె ఎన్నెన్ని మార్పులకోసమో పాటుపడి, ఆ మార్పులు సిద్ధించడం చూశాడు.

స్త్రీలు సభలకు రావడం దుస్సాధ్యంగా పరిగణించే రోజులనుంచీ, సమస్త సామాజిక కార్యకలాపాలలో యే ప్రతిబంధకాలు లేకుండా, స్వేచ్ఛగా పాల్గొనటం చూశాడు. రాజకీయ స్వాతంత్ర్యంపట్లకూడా ఆయనకు ఆసక్తి ఉండేది. అయితే ఈ రోజుల్లోని మేధావులందరి వలెనే ఆయనకూడా రాజకీయాలలో మితవాది.

మానసికంగా నిత్య చైతన్యశీలి వీరేశలింగం. వృద్ధుడై జవసత్వాలుడిగిన తరవాత కూడా, చేతలలో కూడా నిత్యనూతనమైన చైతన్య శీలాన్ని ఆయన చూపుతూనే వచ్చాడు.

గిడుగు రామమూర్తి సాగించిన వ్యావహారిక భాషోద్యమానికి వీరేశలింగం మొదట్లో సుముఖుడు కాడు. 'భాషాభివృద్ధికి నే నేర్పరచుకొన్న మార్గము సులభశైలిలో సలక్షణమైన వచన రచన చేయుట' అని ఎప్పుడో తన రచనను గూర్చి ప్రస్తావించాడు. ఈ సలక్షణత అంటే ఏమిటో గిడుగు రామమూర్తి, వీరేశలింగం ఐదారుసార్లు చర్చించేసరికి, వీరేశలింగం అభిప్రాయాలు మారిపోయి, వ్యావహారిక భాషోద్యమానికి ఆయన సుముఖుడైనాడు. కొవ్వూరులో జరిగిన సారస్వత పరిషత్తు వార్షిక సభలో రామమూర్తిగారి ఉపన్యాసం విన్న తరవాత వీరేశలింగం పూర్తిగా వ్యావహారిక భాషాభిమాని అయినాడు. నవ్యాంధ్ర

వ్యాకరణ రచనకు అప్పుడే ఆయన పూనుకున్నాడు. వ్యావహారికోద్యమాన్ని ప్రచారం చేసే ఉద్దేశంతో వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజం 1919 సంవత్సరంలో ఏర్పడింది. దాని స్థాపకాధ్యక్షుడు వీరేశలింగం. కార్యదర్శులు జయంతి గంగన్న, గిడుగు రామమూర్తి. అయితే ఈ సమాజం స్థాపనమైన మూడు నెలలకే వీరేశలింగం పరమపదించాడు. ఆయన చనిపోతూ తన అనుచరులకు ఈ సందేశాన్ని వ్రాసి ఇచ్చాడు-

"నా జీవితంలో సాధించవల్సిన కార్యములింకెన్నో ఉన్నవి. అవి సాధించబడక పూర్వమే అశువులు వీడవల్సి వస్తున్నది. అయినా నా అనుచరులు, మిత్రులు సంస్కారాభిలాషులు నాయీ మిగిలిన బాధ్యతను నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను. అజ్ఞానంలో, అమాయకత్వంలో జీవిత సంస్కారంలేని ప్రజాసామాన్యానికి విద్య, విజ్ఞానం, సమానత్వం, సంస్కారం, కలిగించడానికి కృషి చేయాలని కోరుతున్నాను."

తన జాతి అభ్యుదయంకోసం ఇంతగా శ్రమించిన మహనీయుడు యుగపురుషుడు కాడా?

# 'ఉత్తమ ఇల్లాలు"

రాజమండ్రికి ఉత్తరాన.
మూడు మైళ్ళ దూరాన.
కాతేరనే చిన్న పల్లెటూరు. కరణం వెన్నేటి వేంకటరత్నం గారు.
ఆ ఊళ్ళోనే అద్దంకి పట్టాభిరామయ్యగారు - సామాన్య మధ్య తరగతి గృహస్థు.
ఆయన భార్య కొండమాంబ. కరణంగారి తోబుట్టువు.
వాళ్ళ సంతానం బాపమ్మ.
బాపమ్మకు తమ్ముడు పుట్టాడు కాని తల్లి పురిట్లో చనిపోయింది.
కరణంగారికి సంతానం లేదు.
తల్లి చనిపోతే మేనమామ అన్నారు. అంటారు పెద్దలు.
వెన్నేటి వేంకటరత్నంగారు బాపమ్మను తీసుకొని వచ్చి పెంచుకొన్నారు.
బాపమ్మకు ఎనిమిదేళ్ళు వచ్చాయి.

వేంకటరత్నంగారు ఆధునిక భావాలు కలవాడు. బాపమ్మను వీధిబడికి పంపించాడు. తెలుగు చదవనూ వ్రాయనూ సుష్టుగా నేర్చుకొన్నది. ఎన్నాళ్ళు పెంచినా ఆడపిల్లను ఒకయ్య చేతిలో పెట్టవలసిందే. పెళ్ళి సంబంధాలకోసం గాలింపు ప్రారంభమైంది. అదృష్టవశాత్తూ రాజమండ్రిలోనే యోగ్యమైన సంబంధం దొరికింది. మంచి సంబంధం పరువు ప్రతిష్ఠలుగల కుటుంబం. వెన్నేటి వేంకటరత్నంగారు కందుకూరి వేంకటరత్నంగారితో మాట్లాడి వచ్చారు. కుర్రవాడు చురుకైనవాడు. ఆ ఏడే ఇంగ్లీషు స్కూల్లో చేరాడు. వృద్ధిలోకి వచ్చేట్లున్నాడు. పన్నెండేళ్ళు వెళ్ళాయి. బాపమ్మ జాతకం దివ్యంగా ఉంది అన్నారు జ్యోతిష్కులు.

బాపమ్మకు పెళ్ళయింది 1861లో. వీరేశలింగాన్ని వివాహమాడింది. పెళ్ళిలో ఆడపెళ్ళి వారొకటీ, మగపెళ్ళి వారొకటి భోగం మేళాలు పెట్టారు. వివాహం వైభవంగా జరిగినట్లు భోగంమేళం ఉంచితే. కన్న ప్రేమకన్నా పెంచిన ప్రేమ పెద్దదంటారు. బాపమ్మకు తల్లిలేదు. వీరేశలింగానికి తండ్రిలేదు. అయినా వాళ్ళను పెంచిన వాళ్ళు ఘనంగా చేశారు పెళ్ళి. పెళ్ళి కూతుర్ని పెళ్ళి కొడుకునూ కూచోబెట్టి చూడ ముచ్చటగా రుక్మిణీ కళ్యాణం చదివించారు. వాళ్ళు ఒకరొకరు అందుకొని పద్యాలు చదువుతుంటే ముచ్చటపడ్డారు.

పున్నమ్మ కోడలును చూసుకొని మురిసిపోయింది. అయితే కోడలిపేరు మాత్రం పాతకాలం పేరులా కనిపించింది. తన తల్లి చిన్నప్పుడే పోయింది 'మా అమ్మపేరు పెట్టి పిలుచుకుంటాను. నీ కిష్టమేనా' అని అడిగింది కోడలును.

'ఇష్టమేనత్తా. నా పేరు ఇక రాజ్యలక్ష్మి' అని చెప్పింది బాపమ్మ.

'నా తల్లే, మా అమ్మే' అని పొంగిపోయింది పున్నమ్మ.

రాజ్యలక్ష్మి పదమూడేళ్ళప్పుడు కాపురానికి వచ్చింది. కంటికి రెప్పలా చూసుకొంది వీరేశలింగాన్ని. వీరేశలింగానికి వెన్నెముకే అయింది ఆమె. వీరేశలింగం ప్రతి క్లాసులోనూ ఫస్టున ప్యాసవుతూ వచ్చాడు. తాను కాపురానికి వచ్చిననాటినుంచీ, ఆయన బోధలు

జాగ్రత్తగా అర్థం చేసుకొంటూ వచ్చింది. ఇంటిదగ్గర ఆయన చెపుతూ ఉండే విషయాలన్నీ ఆసక్తితో ఆలిస్తూ వచ్చింది. తనకు ఎన్నెన్నో కొత్త విషయాలు తెలుస్తున్నాయి.

పెరఢులో అరటి చెట్టున్నది. కొసనుంచి కాకుండా నడిమినుంచి చీల్చుకొని వచ్చి పువ్వు పుట్టింది. ఇరుగూ పొరుగూ వచ్చి అట్లా పువ్వు రావడం అరిష్టం, చెట్టు కొట్టేయించాలన్నారు. మా వారికి అన్నీ తెలుసు. మీరేం చెప్పవలసిన పనిలేదు అన్నది రాజ్యలక్ష్మి. మంచి గెల పడింది. కూర వండుకొంటే బహు రుచిగా ఉన్నాయి కాయలు.

ఇంటి దూలానికి తేనెపట్టు పట్టింది. అశుభం అన్నారు చుట్టపక్కాలు. కోరంగిలో ఉద్యోగం వచ్చిందని చెప్పాడు భర్త. చాలా సంతోషించింది.

అమావాస్యనాడు బయలుదేరిపోతూ ఉంటే అదేమిటండి అని అడుగలేదు. ఆయనకు అన్నీ తెలుసు. లోకాన్ని మరామత్తు చేయటానికి పుట్టిన మహావ్యక్తి ఆయన. ఆ విషయం అనుకొంటే మనసు సంతోషంతో పొంగిపోతుంది.

అత్తగారికి ఆయన రోజూ బోధిస్తూ ఉంటే వింతగా అనిపించింది. తనకు దయ్యాలు, భూతాలు లేవు. అంతా మనసులోని భ్రాంతి అని. అత్తగారికి నిజమేనని పించింది.. కొన్నాళ్ళు భ్రమ కలిగేదికాదు. కాని ఇంతలో గాలి సోకినట్లూ, ఏదో మీదికి వచ్చినట్లు బాధపడిపోతూ ఉండేది.

కోరంగిలో ఒక దయ్యాలపోతు, దయ్యాన్ని వదలగొడతానని వచ్చి దడిపించబోయి దడుసుకొన్నాడు. తనమీదికే దేవుడొచ్చి నెత్తి అణిచాడని ఖాయిలా పడ్డాడు. ఆ దయ్యాల వైద్యుడు దడుపు జ్వరంతో నెలరోజులు తీసుకున్నాడు. తరవాత కాని మామూలు మనిషి కాలేదు. అంతటితో అత్తగారి దయ్యాలబాధ వదిలిపోయింది చాలావరకూ.

కోరంగి నుంచి ధవళేశ్వరం వెళ్ళుతున్నట్లు తెలిసిన రోజున చాలా సంబరపడింది రాజ్యలక్ష్మి. నలభై నాలుగు రూపాయల జీతం. రాజమండ్రికి దగ్గర కాతేరు దగ్గర.

ధవళేశ్వరంలో ఉండగా ఆయన పత్రిక అచ్చువేయడం చూసింది. వివేకవర్ధని ఆ పత్రిక చదువుతూ ఉంటే తనకెన్నో సంగతులు తెలుస్తున్నాయి.

ధవళేశ్వరంలో ఆడపిల్లలకు స్కూలు పెట్టారు. ధవళేశ్వరంలో ఉద్యోగం వదిలిపెట్టి రాజమండ్రి చేరుకొన్నారు.

చల్లపల్లి బాపయ్యగారు, బసవరాజు గవర్రాజుగారు, బయపునేడి వెంకట జోగయ్యగారు, ఏలూరు లక్ష్మీనరసింహంగారు, ప్రతిరోజూ వస్తున్నారు ఇంటికి. రాజమండ్రి అంతా చెప్పుకొంటున్నారు వీరేశలింగాన్ని గూర్చి.

వివేకవర్ధని రాగానే తానూ చదువుతుంది, రాజ్యలక్ష్మి. ఆంధ్ర భాషా సంజీవనీ వస్తుంది తమ ఇంటికి. ఇదేమిటి చెప్మా, ఆ పత్రికలో ఆడవాళ్ళు చదువుకో కూడదు. చదువుకొంటే చెడిపోతారు అని వ్రాస్తారెవరో అని విస్తుపోతుంది. వాళ్ళుకూడ వివేకవర్ధని చదువుకొంటే ఎంత బావుండును! అనుకొంటుంది.

ఇంతలో రాజమండ్రిలో ఇళ్ళల్లో, వీధుల్లో, అరుగులమీద, రచ్చలో, చావిళ్ళలో, ఎక్కడ చూసినా, ఎవరినోట విన్నా, 'ఇదేం పోయే కాలమమ్మా, విధవలకు మళ్ళీ పెళ్ళి చేస్తారట.' వాళ్ళదేపోయేకాలం. పదిమందిదీ వచ్చేకాలం. మంది కెప్పుడూ తమ మంచి

తెలీదు. వీరేశలింగం కళ్ళు చెమరిస్తున్నాయి. పిడికిళ్ళు బిగిస్తున్నాయి. రాజ్యలక్ష్మి భయపడిపోతున్నది.

1881వ సంవత్సరం. శంకరాచార్యులవారు వెలి పత్రికలు పంపుతారట. ఒకరోజున కాతేరునుంచి తన వాళ్ళంతా వచ్చారు. వస్తూ వస్తూనే ఇల్లెగిరిపోయేలా రాగాలు తీశారు. 'ఇంతపని జరుగుతుందనుకోలేదు బాపమ్మా! మా తల్లోయ్! మా అమ్మోయ్! మమ్మల్ని వదిలిపెడతావుటే?' అని అవాచ్యంగా, కావలసినవాళ్ళు పోయినప్పుడు ఏడ్చినట్లు, గుండెలు బాదుకొని జాలిపుట్టేట్లు ఏడ్చారు.

రాజ్యలక్ష్మికి దిగులైంది. 'ఏమిటి మీకు పిచ్చి. ఇప్పుడేమైంది. ఒకరిల్లు నిలపటం కాని, మేం చేస్తున్నది ఒకరిల్లు కూల్చటం కాదే' అని నచ్చచెప్పబోయింది. 'మా ఇల్లు కూలిపోతున్నదే తల్లీ' అని మళ్ళీ గోలగా ఏడ్చారు.

రాజ్యలక్ష్మికి కోపం వచ్చింది 'అయితే ఏమంటారో చెప్పండి' అని అడిగింది.

'నే పోయి గోదావరిలో పడతానని బెదిరించు. పుట్టింటికి వెళ్ళిపోతానని జగడం పెట్టుకో. అప్పుడు మీ అయన మగడు పోయిన దానికి మళ్ళీ పెళ్ళి మాట తలపెట్టడు' అని హితబోధ చేశారు.

'మా ఆయన సంగతి మీకు తెలియదు. మావారి మాటే నాకు సర్వస్వం' అని ఖండితంగా చెప్పి పంపించింది చిరునవ్వుతో రాజ్యలక్ష్మి.

పదేళ్ళ పిల్ల గౌరమ్మ ఇంటికి వచ్చిన సంగతి ఎట్లా తెలిసిందో! దేవుడు వెలిశాడంటే చూడటానికి జనం ఎట్లా విరగబడతారో, అట్లా తిరుపతి వేంకటేశ్వరుడి గుడిలా అయిపోయింది ఇల్లు. ప్రతి వాళ్లూ వచ్చి చూసిపోతున్నారు.

డిసెంబరు 11వ తేదీ పెళ్ళి. గోగులపాటి శ్రీరాములు తనకు మరిదిలాంటివాడు. అత్తగారు తన కొడుకు లాగానే పెంచింది శ్రీరాములునుకూడా. శ్రీరాములు పెళ్లి కొడుకు, గౌరమ్మ పెళ్ళి కూతురు. ఇంటి చుట్టూ పోలీసులు. ఎందరెందరో పెద్ద అధికారులు వచ్చారు పెళ్ళికి. ఆయన ధైర్యం చూస్తూ ఉంటే ఆశ్చర్యమనిపిస్తుంది.

నాలుగు రోజుల్లో ఇంకొక పెళ్ళి చేశారు. సీతమ్మ పెళ్ళి. రామచంద్రరావే పెళ్ళికొడుకు. తమ ఇంట్లో ఇట్లాంటి పెళ్ళిళ్ళు చేయడం అలవాటైపోయింది.

అయితే ఒక పెళ్ళికి నీళ్ళ వాళ్లూ, వంటవాళ్ళూ మేం రామంటే రామన్నారు. మిమ్మల్ని వెలివేశాం పొమ్మన్నారు. రాజ్యలక్ష్మి బిందె పట్టుకొని గోదావరికి నడిచింది. పెళ్ళివాళ్ళకు వంటచేసి పెట్టింది. చేతులు రెండూ దగ్గరచేర్చి దండం పెట్టాలి ఆ తల్లికి. ముప్పైయేళ్ళుకూడా నిండలేదప్పుడామెకి. రాజ్యలక్ష్మి వెన్ను తట్టకపోతే, చిరునవ్వుతో సరసన నిలబడకపోతే వీరేశలింగం ఏం చేసేవాడు?!

ఏం చేయనే లేకపోయేవాడు.

తొలి జన్మమంటూ ఒకటి ఉంటే, ఒకరొకరు చేసిన పుణ్యం వల్ల వాళ్ళు దంపతులైనారు.

వీరేశలింగం కాలేజీనుంచి వచ్చి తలపాగా తీస్తూ ఉండగా చిరునవ్వు వెన్నెలలు కాయిస్తూ 'ఏవండోయ్ - మీకొక శుభవార్త' అనేది రాజ్యలక్ష్మి.

ఆయన పోల్చుకొనేవాడు.

"ఈ పిచ్చి పిల్ల ఎంత దూరంనుంచీ వచ్చిందో తెలుసా? గంజాం జిల్లా అట. ఎక్కడ గంజాం. అస్కాపురం వీళ్ళది. అందరూ చెప్పుకోవటం విని ఆశపడి, అన్నం నీళ్ళుకూడా లెక్కచేయక, ఇంకో పిల్లనుకూడా ప్రయాణంచేసి బయలుదేరింది. కాళ్ళు నొప్పులు పుట్టేట్లు నడిచారు. నడిచి నడిచి విజయనగరం చేరుకొన్నారు. ఇంకో పిల్ల గుండె గుభిల్లుమన్నది. నా కాళ్ళాడటంలేదు. నేను రాలేను అన్నది. ఈ పిల్ల మహామొండిఘటమండీ. గుండెలో నిప్పుల కుంపటి కాదా విధవ - అని అందరూ అనటం మురుగులమ్ముకొని, అంచెబళ్ళమీద పడి, పడి ఇవాళ మధ్యాహ్నం రెండు గంటలకు మనింటికి వచ్చిందండి! పొరుగింటి మహాలక్ష్మి, పొరుగింటి బుచ్చెమ్మగారూ, ప్రార్థనా మందిరమూ, టౌనుహాలూ చూడటానికి బయలుదేరాం. ఇంకా పదిమంది రారూ మేమూ వస్తామని! ఇంతలో ఈ పిల్ల వచ్చేసరికి నా కడుపు తరుక్కునిపోదూ. మీరు పోండర్రా, తరువాత నే వస్తా అని, ఇంట్లోకి తీసుకొని వెళ్ళాను. స్నానం చేయించి, అన్నం పెడదామంటే మనింట్లో అయిపోయె. ఎప్పుడు అన్నం తిన్నదో పిచ్చి సన్నాసి. వొండి పెడదామన్నా మనసు వుండబట్టక, పొరుగింటికి వెళ్ళి అన్నం తెచ్చి పెట్టాను. పిచ్చితల్లీ, బాబయ్యగారు పిలుస్తున్నారు రా."

ఆ పిల్ల లోపలినుంచి వచ్చి దండం పెట్టింది.

వీరేశలింగం కడుపు నిండిపోయింది. అటువంటి సన్నివేశాలు ఎన్నో వాళ్ళ జీవితంలో! చెన్నపట్నంలో, బెంగుళూరులో, బందరులో, బళ్ళారిలో, గుంటూరులో, బరంపురంలో, బొంబాయిలో, పూనాలో, సికింద్రాబాద్‌లో వీరేశలింగం పక్కనే రాజ్యలక్ష్మమ్మ ఉండవలసిందే. ఆయనకు సమస్తోపచారాలూ ఆమె చేయవలసిందే.

బాల వితంతువులెందరో వచ్చేవాళ్ళు. వాళ్ళను కడుపులో పెట్టుకొని కాపాడేది. విద్యాబుద్ధులు నేర్పేది. రాగానే అక్షరాలు దిద్దబెట్టేది. రేపు పెళ్ళి అయి అత్తగారింటికి వెళితే మీ కష్టసుఖాలు తెలియజేయటానికి మాకు జాబులు వ్రాయవద్దా, చదువు నేర్చుకోకపోతే ఎట్లా? అని బుజ్జగించి చెప్పేది. చెడుదారి నడిచిన అభాగ్యురాండ్రను అసహ్యించుకొనేది కాదు. ఆదరించేది. ఒకసారి ఒక వితంతువు బిడ్డని కని వదిలేసి చెప్పకుండా పారిపోయింది. ఆ శిశువును ప్రేమతో పెంచవలసి వచ్చింది రాజ్యలక్ష్మిగారికి. మలమూత్రాలుకూడా శుభ్రం చేయవలసి వచ్చినా, ఆ అగతిక శిశువును పెంచింది రాజ్యలక్ష్మమ్మ.

స్త్రీ సమాజాన్ని ఆమె నిర్వహించేది. స్త్రీల ప్రార్థనా మందిరంలో తాను చేసిన కీర్తనలు పాడి, ప్రార్థనలు చేసేది. ఆ రోజుల్లో ఎక్కడాకూడా స్త్రీలకు ప్రత్యేక సమాజమూ, సమాజ మందిరమూ, ప్రార్థనా సమావేశాలులేవు - ఒక్క రాజమండ్రిలో తప్ప.

రాజమండ్రి వెలుగు వీరేశలింగం.

రాజమండ్రి వెన్నెల రాజ్యలక్ష్మి.

తెలుగుదేశానికి వెలుగు వీరేశలింగం.

ఆ వెలుగు సాయంతో వెన్నెలవలె వెలిగింది రాజ్యలక్ష్మమ్మ.

మిట్ట మధ్యాహ్నం. వీధుల్లో కాళ్ళంటుకొని పోతున్నాయి, చెప్పులు లేని పాదాలను. అభాగ్యుడొకడు వడగొట్టి నడి ఎండలో, కడు డస్సి పడిపోయినాడు. కడజాతి అట.

ఎక్కడి మనుషులు వీళ్ళు. మంచి పెద్దలు కాదట మాన్యతను తెచ్చేవి. ఎవ్వరు అటువైపు చూసిన పాపాన్ని కట్టుకోలేదు. రాజ్యలక్ష్మమ్మ హృదయం విలవిల్లాడింది. మానవత్వం ఆమెను నిలవనీయలేదు. వీధిలోకి వచ్చి దారినపోయే వాళ్ళందరినీ బ్రతిమిలాడింది - 'సాయం చేయండి. మా ఇంట్లో అరుగుమీద నీడ పట్టుకు చేర్చండి' అని. కాని ఎవ్వరూ కనిపించలేదు. కనపర్తి శ్రీరాములుగారు సజ్జనుడు. ఆ దారిన వెళుతున్నాడు. వీరేశలింగంగారి అనుచరుడు. ఆయన బోధలు తలకెక్కినవాడు. ఆయన్నూ అర్థించింది, సాయం చేయమని. ఇద్దరూ కలిసి ఇంట్లోకి చేర్చారు ఆ అభాగ్యుణ్ని.

ఆ రోజుల్లో అంత ఉదారదృష్టి. బయట వీధిలో కాలుమోపటానికికూడా ఆస్కారంలేని ఆడపుటక పుట్టికూడా, రాజ్యలక్ష్మమ్మ అంత ఉన్నతురాలైందంటే, ఆమె మహోన్నత వ్యక్తిత్వం ఎంతటిదో ననుకోవాలి. వీరేశలింగం మాటల్లోనే చిత్తగించండి:

> "ఈ కార్యములయందు నావలెనే నా భార్యయు బద్ధాదరము కలదై సర్వకష్టములను సంతోష పూర్వకముగా సహించి నన్ననుసరించుచు సహధర్మచారిణియన్న పేర స్వర్థము చేయుచుండెను. నా భార్యయొక్క యానుకూల్యమే లేక యుండిన యెడల నేనిన్ని కార్యములను నిరంతరాయంగా నిర్వహింపలేక యుందునేమో!"

మొట్టమొదటి స్త్రీ పునర్వివాహంలో వరుడైన గోగులపాటి శ్రీరాములుగారికి, మొదటి భార్య చనిపోయే నాటికి నాలుగు నెలల కొడుకున్నాడు. వీరేశలింగంగారిమీద అతడికున్న భక్తి గౌరవాలవల్ల తన కొడుక్కి వీరేశలింగం పేరే పెట్టుకున్నాడు శ్రీరాములు. ఆ చిన్న వీరేశలింగాన్ని రాజ్యలక్ష్మమ్మే పెంచి పెద్ద చేసింది.

మొదట తాను వితంతువు నెవరినైనా వివాహం చేసుకుంటానని చెపుతూ వచ్చాడు. కాని తరవాత ప్రాయశ్చిత్తం చేయించుకొని, బెంగుళూరులో సాంప్రదాయానుసారంగా వివాహం చేసుకొన్నాడు. అప్పుడు రాజ్యలక్ష్మమ్మ మనస్సు సంక్షోభించింది. ఆమె మనస్సు స్వాస్థ్యం తప్పింది. 'కల్లకాదు సుతునిబాసి తల్లడిల్లుచుంటిని. ఉల్లమందు నిలిచి నీవు నా మనస్సు చల్లచేయవే॥ భర్తగారె దైవమనుచు పాటుపడుచు నుంటిని, భర్తగారి కారోగ్యమొసగి భక్తవత్సల కావవే॥" అనే చరణాలు ఆ రోజుల్లో ఆమె రచించి, దైవాన్నిగూర్చి ప్రార్థించిన పాటలోనివి.

ఆమెకు పువ్వులంటే చాలా ప్రీతి. ప్రార్థనా సమాజానికి వెళ్ళినప్పుడు బుట్టనిండా పువ్వులు తీసుకొని వెళ్ళి సువాసినులందరికీ పంచిపెడుతూ ఉండేది. వితంతు శరణాలయంలోని ముద్దరాండ్రందరికీ, జడలో ఒక్కొక్కపువ్వు తానే తురిమేది ప్రతిరోజూ. ఇంట్లో మాలిమిగా తిరిగే కుక్కలూ, పిల్లులూకూడా రాజ్యలక్ష్మమ్మపట్ల ఎంతో ప్రేమ చూపేవి. "భర్తగారికంటె ముందుగా నన్ను నీ సాన్నిధ్యమునకు గొనిపొమ్ము" అని దేవుణ్ణి ఆమె ప్రార్థిస్తూ ఉండేది.

> "నేనే సాహస కార్యమునందడుగు పెట్టినను తాను వెనుకంజవేయక, నన్ను వెనుక కీడ్వక తోడునీడయైయుండి ప్రోత్సాహ వాక్యములు పలుకుచు నన్ను ముందుకు నడిపించుచుండెను. నాది కొంత కోప స్వభావము. నా భార్యది శాంత స్వభావము." "ఆమె మాత్ర స్నేహముతో చేసెడి యుపచారము సదా నా

శరీర సంరక్షణమున కత్యంత సహకారిగానుండుచు వచ్చినట్లే, మంత్రివలె జేసెడి యుపదేశముకూడ నా యాత్మ సంరక్షణమునకు సహకారిగా నుండుచు వచ్చెనని చెప్పవచ్చును."

"ఆమె తెల్లవారుఝామున లేచినది మొదలుకొని గృహకృత్య నిర్వహణాదులయందు విరామములేక పాటుపడుచు తీరికయైనప్పుడెల్ల నేదో వ్రాయుచుండుటలోను, చదువు చుండుటలోను కాలము గడుపుచుండెను. చేయవలసిన కృత్యములలోనెల్ల నా సంరక్షణ తనకు ప్రథమ కర్తవ్యముగా భావించి నన్ను పసిబిడ్డను పెంచినట్లు పెంచుచుండెడిది. నేనే మంచి పనికి బూనినను నాకు సహాయురాలై యుండి సమస్త విషయములలోను ఛాయవలె నన్ననుసరించుచు సహధర్మచారిణియని పిలువబడుటకు సర్వవిధముల నర్హురాలైయుండెను. వితంతు వివాహ ప్రయత్నమువలన నేను జాతి బహిష్కృతుడనైనను, బ్రహ్మ మతానుష్ఠాన పరుడనయి యజ్ఞోపవీతవిసర్జనము చేయుటవలన కొన్ని నూతన కష్టములకు పాత్రుడనయినను నన్ను నిరుత్సాహపరుపక హృదయ పూర్వకముగా నన్ననువర్తించుచుండెను."

ఈ విధంగా భర్త వ్రాశాడంటే రాజ్యలక్ష్మమ్మగారు చాలా ధన్యురాలు. కట్టమంచి రామలింగారెడ్డిగారా దొడ్డ ఇల్లాలి నిట్లా కీర్తించారు -

"పంతులుగారి కార్యసేవకు సహభూతురాలుగానున్న రాజ్యలక్ష్మమ్మగారి చరిత్రము నుదాహరించకపోయిన పంతులుగారి చరిత్ర అసంపూర్తియే యనవచ్చును. ఆమె... గారికి తోడునీడగ నుండి ఆయన చేయు ప్రతి పనికిని తోడగుచు భారత నారీ లోకమునకు మార్గదర్శకురాలై భారత స్త్రీ చరిత్రమును పవిత్రవంతముగ చేసిన మహనీయురాలు."

వీరేశలింగం తన స్వీయ చరిత్రను దొడ్డ ఇల్లాలికే అంకితం చేశారు. పూవుకు తావి అబ్బినట్లయింది. మొట్టమొదట విజ్ఞాన చంద్రికా మండలివాళ్ళు ప్రకటించిన స్వీయచరిత్రలో తప్ప, తరువాత ఏ ముద్రణంలోనూ ఈ అంకితం ప్రస్తావన లేకపోవడం, తెలుగువాళ్ళ అవివేకతను, వీరేశలింగం దంపతులపట్ల వాళ్ళ అపచారాన్ని వ్యక్తీకరించడమే.

"ఓమ్.

నేను చేసిన సమస్త ప్రయత్నములలోను
ఛాయవలె నాతోడనుండి నన్ను ప్రోత్సాహపరచుచు
ధర్మ మార్గానుసరణమునందు నాతోడగూడ
సకల కష్టములను సంతోషపూర్వకముగా వహించుచు
సత్యమైన సహధర్మ చారిణియయి
తల్లిబిడ్డకువలె నవ్యాజానురాగముతోడ
సహస్ర హస్తములతో సదా నాకు సంరక్షణము చేయుచు
ఏబది సంవత్సరాల కాలము
నా ప్రాణమునను ప్రాణమయి యుండిన

నాయర్ధాంగ లక్ష్మియైన రాజ్యలక్ష్మికి
దీని నే నంకితము చేయుచున్నాడను."

అర్థ శతాబ్దికాలం, వీరేశలింగం జీవితాన్ని రాజ్యలక్ష్మమ్మ సార్థకం చేసింది.

రాజ్యలక్ష్మమ్మ పుట్టినరోజు నవంబర్ 5, 1851, గురువారం కార్తీక శుద్ధ ద్వాదశి.

ఆమె పరమపదించినది ఆగస్టు 12, 1910, శుక్రవారం, శ్రావణమాసం, శుద్ధ సప్తమి.

వీరేశలింగం పుట్టినరోజు ఏప్రిల్ 16, 1848.

ఆయన పరమపదించింది మే 27, 1919.

ఆయన యాభై ఏళ్ళ జీవితాన్ని ఆమె పంచుకొన్నది.

రాజ్యలక్ష్మమ్మ ధన్య చరిత!

# అనుబంధం-1

# వీరేశలింగం జీవితంలోని కొన్ని ముఖ్య ఘట్టాలు.

**జననం :** 1848 ఏప్రిల్ 16వ తేదీ. కీలక నామ సంవత్సరం చైత్రమాసం ఆదివారం.

**జన్మస్థలం :** రాజమండ్రి.

**జననీ జనకులు :** పున్నమ్మా, సుబ్బారాయుడు.

**అక్షరాభ్యాసము :** 1853, వీరేశలింగం వీధి బడిలో ప్రవేశించటం, బడిపంతులు పులిపాక అమ్మిరాజు. అక్షరాలు గుణింతాలు నేర్చుకొని ఎక్కాల పుస్తకం పట్టారు. తరవాత ఇంకొకబడి. ఇక్కడి పంతులు గూడ సోమరాజు. బాల రామాయణం, అమర నిఘంటువు, శతకాలు, ఆంధ్రనామ సంగ్రహం వల్లెవేశారు.

**ఉపనయనం :** 1856.

1860 : ఇంగ్లీషు పాఠశాలలో ప్రవేశించారు.

1861 : రాజ్యలక్ష్మమ్మగారితో వివాహం.

1867 : బ్రాహ్మ మతాభిమానం తల ఎత్తింది.

1868-69 : కవిత్వం చెప్పటానికి పూనుకొని రెండు శతకాలు వ్రాయడం జరిగింది - అవి వేణుగోపాల శతకము, మార్కండేయ శతకము.

1870 : మెట్రిక్యులేషన్ ప్యాసు కావడం. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధ రచనము.

1871 : మొదటిసారి ఉపాధ్యాయ పదవి లభించింది. రాజమండ్రి గవర్నమెంటు హైస్కూలులో సహాయోపాధ్యాయుడు.

1872 : భాషాంతరీకరణ పరీక్షలో ఉత్తీర్ణులు కావడం, కోరంగిలో ఇంగ్లీషు పాఠశాల ప్రధానోపాధ్యాయ పదవి చేపట్టడం. ఈ కాలంలో మద్రాసునుంచి వెలువడుతుండిన ఆంధ్ర భాషా సంజీవనిలోనూ, బందరునుండి వెలువడుతుండిన పురుషార్థ ప్రదాయినిలోనూ రచనలు చేశారు.

1874 : ధవళేశ్వరంలో ఇంగ్లీషు - వెర్నాక్యులర్ స్కూల్‌లో ప్రధానోపాధ్యాయులుగా చేరారు. ధవళేశ్వరంలో రెండుసార్లు, రాజమండ్రిలో ఒకసారీ అష్టావధానం చేశారు. ధవళేశ్వరంలో బాలికా పాఠశాల స్థాపించారు. ఈ సంవత్సరమే అక్టోబరు నెలలో వివేకవర్ధని ప్రథమ సంచిక వెలువడింది. ఇది మాసపత్రిక.

1875 : సంక్షేప లేఖన పరీక్ష (ప్రెసిరైటింగ్)లో ఉత్తీర్ణత. ఇ.పి.మెట్కాఫ్‌తో పరిచయం.

1876 : వివేకవర్ధని పక్షపత్రిక అయింది. అనుబంధంగా హాస్య సంజీవనికూడా ప్రారంభమైంది.

1878 : సంఘ సంస్కార సమాజ స్థాపనము.

1879 : ప్రార్థనా సమాజ స్థాపనము. రాజమండ్రిలో అగస్టు 3వ తేదీన స్త్రీ పునర్వివాహాన్ని గూర్చి వీరేశలింగం మొదటి ఉపన్యాసం ఇచ్చాడు.

అక్టోబరు 12న రెండో ఉపన్యాసం.

1880 : స్త్రీ పునర్వివాహ సమాజ స్థాపనము. తెలుగుదేశంలో ఆధునిక కాలంలో నాటక ప్రదర్శనలు (వ్యవహార ధర్మబోధిని)

1881 : చమత్కార రత్నావళి, రత్నావళి నాటక ప్రదర్శనము. డిసెంబరు 11 ప్రథమ స్త్రీ పునర్వివాహం జరిగింది. వధూవరులు గౌరమ్మ, గోగులపాటి శ్రీరాములు. డిసెంబరు 15న రెండవ స్త్రీ పునర్వివాహం. వధూవరులు రత్నమ్మ, రాచర్ల రామచంద్రరావు.

1882 : అక్టోబరులో మూడో పునర్వివాహం.

1883 : స్త్రీలకోసం ప్రత్యేకంగా సతీహితబోధిని పత్రిక వీరేశలింగం ప్రారంభించాడు.

1884 : స్త్రీ పునర్వివాహ సమాజంలో మార్పులూ, చేర్పులూ,

1885-86 : రాజమండ్రి పురపాలక సంఘ సభ్యత్వం. స్త్రీ పునర్వివాహ విషయంలో ఎంతో ధన సహాయం చేసిన పైడా రామకృష్ణయ్యగారి మరణం.

1888 : సంఘ సంస్కరణ విషయికంగా వీరేశలింగానికి కుడి భుజంలా పనిచేసిన బసవరాజు గవర్రాజు మరణం.

1890 : వివేకవర్ధని ప్రచురణ ఆగిపోయింది.

1891 : టౌన్‌హాల్ కట్టించారు. చింతామణి అనే మాసపత్రికను న్యాపతి సుబ్బారావుగారి తోడ్పాటుతో ప్రారంభించారు. రాజమండ్రి ప్రార్థనా సమాజం పక్షాన సత్యసంవర్ధని అనే పత్రిక ప్రచురణ ప్రారంభమైంది. ఈ పత్రికలో వీరేశలింగం చాలా ఉపన్యాసాలు, ప్రహసనాలు ప్రకటించాడు.

1893 : రావుబహదూర్ బిరుదంతో వీరేశలింగాన్ని ప్రభుత్వం సన్మానించింది.

1896 : కవుల చరిత్ర రచన సందర్భంగా, గ్రంథ పరిశోధన కోసం తంజావూరు దర్శించడం.

1897 : టౌను హాలుకు ఆనుకొని ఉండేటట్లు ప్రార్థనా మందిరం నిర్మాణం. రఘుపతి వెంకటరత్నంచే ప్రారంభోత్సవం. గోదావరీ మండల సాంఘిక సభకు అధ్యక్షత. రెండేళ్ళ సెలవుపై మద్రాసు నివాసం.

1898 : మద్రాసులో వితంతు శరణాలయ స్థాపన. మద్రాసులో జరిగిన సాంఘిక మహాసభలో వీరేశలింగానికి దక్షిణదేశ విద్యాసాగర బిరుదు ప్రదానం.

1899 : మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో పండిత పదవి.

1901 : మద్రాసులో సంఘ సంస్కార సమాజమందిర నిర్మాణం.

1903 : రాజమండ్రిలో స్త్రీలకై ప్రార్థనా మందిర నిర్మాణం.

1904 : "తెలుగు జనానా" పత్రికకు రాయసం వేంకటశివుడు గారితో కలిసి సంపాదకత్వం.

1905 : రాజమండ్రిలో బాలికా పాఠశాల స్థాపనం.

1906 : అనుష్ఠాన బ్రాహ్మ మత దీక్ష. జందెం తీసివేయడం. డిసెంబరు 15, హితకారిణీ సమాజ స్థాపనం.

1907 : కలకత్తా ప్రయాణం. ఆది బ్రాహ్మ సమాజం, సాధారణ బ్రాహ్మ సమాజం వీరేశలింగాన్ని సన్మానించాయి. బెంగుళూరు ప్రయాణం.

1908 : బెంగుళూరులో ప్రార్థనా మందిర నిర్మాణం. వీరేశలింగానికి షష్టిపూర్తి జరిగింది. మార్చి 9 దేశిరాజు పెద బాపయ్య నిర్యాణం. హితకారిణి సమాజం రిజిష్టర్ చేయటం. సుమారు ఏభై వేల రూపాయల సొత్తు సమాజానికి సమర్పించుట.

1909 : హితకారిణీ సమాజానికి చందాలకోసం భారతదేశంలోని ప్రధాన పట్టణాల పర్యటన. రాజమండ్రిలో అగతిక యువతీ సంరక్షణశాల స్థాపనం. పూనా నగరంలో కార్వే పండితుణ్ణి కలిసికోవడం.

1910 : ఆగస్ట్ 12. ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ నిర్యాణం.

1917 : కవుల చరిత్ర, ప్రథమ భాగ సంస్కరణ ముద్రణ.

1919 : వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజ స్థాపన, దీనికి వీరేశలింగం వ్యవస్థాపకాధ్యక్షుడు. జయంతి గంగన్న, గిడుగు రామమూర్తిగారలు కార్యదర్శులు. వ్యావహారిక భాషోద్యమానికి పుట్టిన సంస్థ ఇది.

1919 : మే 27, మద్రాసు వేదవిలాస్‌లో వీరేశలింగం నిర్యాణం. మే 28, భౌతికకాయం పంచభూతాల్లో లీనం కావడం.

# గ్రంథ రచనా వివరాలు

| | | |
|---|---|---|
| మార్కండేయ - వేణుగోపాల శతకాలు | ... | 1868-69 |
| రసిక జన మనోరంజనం | ... | 1870-71 |
| శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం | ... | 1870-71 |
| శుద్ధాంధ్రోత్తర రామాయణము | ... | 1872 |
| సంగ్రహ వ్యాకరణము | ... | 1872 |
| నీతి దీపిక | ... | 1874 |
| నీతి చంద్రిక, విగ్రహ తంత్రము | ... | 1874 |
| జాన్ గిల్పిన్ | ... | 1874 |
| ది కామెడి ఆఫ్ ఎర్రర్స్ (యథా తథానువాదము - అసంపూర్ణము) | ... | 1875 |
| అభాగ్యోపాఖ్యానము | ... | 1875 |
| పదార్థ వివేచన శాస్త్రము - (ప్రశ్నోత్తర రూపము - అసంపూర్ణము) | ... | 1878 |
| బ్రాహ్మ వివాహము | ... | 1878 |
| నీతి చంద్రిక - సంధి | ... | 1878 |
| శుద్ధాంధ్ర భారత సంగ్రహము | ... | 1879 |
| వ్యవహార ధర్మ బోధిని | ... | 1879 |
| రత్నావళి (శ్రీహర్షుని సంస్కృత నాటకానువాదం) | ... | 1880 |
| వివేకదీపిక (అసంపూర్ణ నాటకం) | ... | 1880 |
| వెనీసు వర్తక చరిత్రము (షేక్స్పియర్ 'ది మర్చెంట్ ఆఫ్ వెనీస్'కు అసంపూర్ణ నాటకానువాదం) | ... | 1880 |
| రాజశేఖర చరిత్రము (నవల) | ... | 1880 |
| చమత్కార రత్నావళి (షేక్స్పియర్ 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్'కు వచనానువాద నాటకం) | ... | 1880 |
| శాకుంతలమ్ | ... | 1883 |
| సత్యవతీ చరిత్ర (నవల) | ... | 1883 |
| సత్యా ద్రౌపదీ సంవాదం (ఏకపాదవృత్తం) | ... | 1883 |
| చంద్రమతీ చరిత్ర (వచన కావ్యం) | ... | 1884 |
| స్త్రీ నీతిదీపిక (బాలికలకోసం కూర్చిన నూరుపద్యాలు) | ... | 1884 |
| ప్రహ్లాద నాటకం (స్వతంత్ర నాటకం) | ... | 1885 |

| | | |
|---|---|---|
| ప్రబోధ చంద్రోదయం (అనువాదం) | ... | 1885 |
| మాళవికాగ్నిమిత్రం (అనువాదం) | ... | 1885 |
| దక్షిణ గోగ్రహణం (స్వతంత్ర నాటకం) | ... | 1885 |
| రాగమంజరి (షెరిడన్ "దిడ్యూయన్నా" అనువాదం) | ... | 1885 |
| సత్య హరిశ్చంద్ర (స్వతంత్ర నాటకం) | ... | 1886 |
| దంభాచార్య విలసనం (ప్రహసనం) | ... | 1886 |
| ఆంధ్ర కవుల చరిత్ర (ప్రథమ భాగం) | ... | 1887 |
| శరీర శాస్త్ర సంగ్రహము | ... | 1888 |
| దేహారోగ్య ధర్మబోధిని | ... | 1889 |
| తిర్యగ్ విద్వన్ మహాసభ | ... | 1889 |
| సత్యరాజా పూర్వాదేశ యాత్రలు | ... | 1891 |
| నీతికథామంజరి (ఈసఫ్ నీతికథలు) | ... | 1894 |
| కళ్యాణ కల్పవల్లి (షెరిడన్ "ది రైవల్స్"కు నాటకానువాదం) | ... | 1894 |
| జ్యోతిషశాస్త్ర సంగ్రహం | ... | 1895 |
| పత్నీహిత సూచని | ... | 1896 |
| జంతు స్వభావ చరిత్రం | ... | 1896 |
| స్వీయ చరిత్ర (2 సంపుటాలు) | ... | 1911-15 |
| నవ్యాంధ్ర వ్యాకరణం (అసంపూర్ణము) | ... | 1919 |

ఇవికాక ఎన్నో ప్రహసనాలు, అనువాదాలు, దేశ చరిత్ర, జీవిత చరిత్ర, విమర్శ, వ్యాసాలు వీరేశలింగం ప్రకటించాడు. పూర్వ కవుల కావ్యాలు పరిష్కరించి ప్రకటించాడు.

# అనుబంధం-2

# వీరేశలింగంగారి మిత్రులు కొందరు

**బసవరాజు గవర్రాజు :** వీరేశలింగంగారికి కుడి భుజంలాగ పనిచేశాడీయన. వీరేశలింగం గారిని సమస్త సంఘ సంస్కరణ ప్రయత్నాలలోను ప్రోత్సాహపరచినాడు. పరోపకారశీలి. మేధావి. సత్యసంధుడు. చిన్నవయస్సుననే మరణించాడు. ఆయన మరణంతో "నాకావరకున్న కార్యోత్సాహము సగము తగ్గిపోయినది" అని వీరేశలింగం స్వీయ చరిత్రలో వ్రాశాడు. స్వీయచరిత్రలో విశేషించి గవర్రాజుగారి ప్రస్తావన వస్తుంది. ఈయన రాజమండ్రిలో వీరేశలింగంగారి వీధిలోనే ఉండేవారు. 1888లో చనిపోయినాడు.

**చల్లపల్లి బాపయ్య :** వీరేశలింగం బాల్య సఖుడు. స్కూలు తరగతులలో కలిసి చదువుకున్నారు. సంఘ సంస్కరణాభిమాని. వితంతు వివాహాలు చేయించటానికి పూనుకోవలసిందని వీరేశలింగాన్ని తీవ్రంగా ప్రోత్సహించి, ఆ రంగంలో చాలా కృషి చేసినవాడు. ఈయన అన్న చల్లపల్లి రామబ్రహ్మం సనాతన పక్ష నాయకులు. అయినా బాపయ్య, ఆజీవమూ వీరేశలింగం పక్షానే ఉన్నాడు. వితంతు వివాహాలకు భోజనాలకూ, తాంబూలాలకు ఎవరెవరు వస్తారా? అని ఇల్లిల్లూ తిరిగి సమాచారాన్ని సేకరించాడు. కేశవచంద్రసేన్ పుస్తకం ఈయననుంచో, ఈయన ఇంకో అన్న రంగయ్య నుంచో తీసుకొని తాను చదివినట్లు వీరేశలింగం స్వీయచరిత్రలో వ్రాశాడు.

**ఆత్మూరి లక్ష్మీనరసింహం :** ఇంగ్లీషు స్కూల్లో చదివేటప్పుడు వీరేశలింగానికి గురువు. బందరునుంచి సెకండ్ అసిస్టెంటుగా రాజమండ్రి స్కూలుకు బదిలీ అయి వచ్చాడు. బ్రహ్మసమాజ బోధలు చేసి, సంఘ సంస్కరణ కృషి విషయికంగా వీరేశలింగాన్ని చాలా ప్రోత్సహించాడు. స్త్రీ పునర్వివాహ సమాజంలో ముఖ్య సభ్యుడు. తరువాత ఈయన బి.ఏ., బి.ఎల్. ప్యాసై, డిస్ట్రిక్టు మున్సిఫ్ ఉద్యోగం చేశాడు. పైడా రామకృష్ణయ్య అనే వదాన్యుణ్ని ప్రోత్సహించి, వితంతు వివాహ సమాజానికి పదివేల రూపాయల విరాళం ఇప్పించాడు. తరవాత తరవాత వీరేశలింగానికి ఈయనకూ చెడింది. ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారిని వీరేశలింగం తరవాత కాలంలో చాలా విమర్శించాడు.

**న్యాపతి సుబ్బారావు :** వీరేశలింగంగారి సన్నిహిత మిత్రుడు. రాజమండ్రిలో ఆ రోజుల్లో బాగా ప్రాక్టీసు ఉన్న లాయరు. వీరేశలింగాన్ని సంఘ సంస్కరణ విషయాలలో చాలా ప్రోత్సహించేవాడు. ఈయనకూ వీరేశలింగానికీకూడా భేదాభిప్రాయాలు వచ్చి, కొన్నాళ్ళు ఇద్దరి మధ్యా మాటలు లేకుండా పోయినవి.

**ఏలూరు లక్ష్మీనరసింహం :** వీరేశలింగానికి మొదట చాలా సన్నిహిత మిత్రుడిగా ఉండి, పిమ్మట ప్రబల శత్రువైనాడు. మొదటి రోజుల్లో సంఘ సంస్కరణాభిమాని. తరవాత మునిసిపాలిటీ రాజకీయాలలో ప్రధాన పాత్ర వహించాడు.

**రఘుపతి వేంకటరత్నం** : వీరేశలింగం వృద్ధాప్యంలో అయన సంఘ సంస్కరణ కృషికి అండగా నిలిచాడు. వీరేశలింగమంటే చాలా ప్రేమాభిమానాలున్నవాడు. రఘుపతి వెంకటరత్నం పవిత్ర జీవితం లోక విదితం.

**దేశిరాజు పెదబాపయ్య** : వీరేశలింగానికి యజ్ఞోపవీత విసర్జనంలో గురుత్వం వహించినవాడు. ఇరవై ఆరేళ్ళ చిన్న వయస్సులోనే మరణించాడు. విస్ఫులింగం వంటి సంఘ సంస్కరణాభిమాని. అతి పవిత్ర జీవనుడు. వీరేశలింగానికి చాలా విధాలుగా తోడ్పడ్డాడు.

**పైడా రామకృష్ణయ్య** : తన జీవిత కాలంలో వీరేశలింగం ఉద్యమించిన స్త్రీ పునర్వివాహాలకుగాను ముప్పైవేల రూపాయల విరాళం అందజేసినాడు. పట్టభద్రుడు. సంఘ సంస్కరణాభిలాషి. కాని పాపం, ప్రాయశ్చిత్తం చేయించుకోవలసి వచ్చింది. చిన్ననాటనే దివంగతుడైనాడు. కాకినాడ పురనివాసి.

**కొక్కొండ వేంకటరత్నం** : భాషా రంగంలోనూ, సంఘ సంస్కరణ రంగంలోనూ వీరేశలింగం ప్రతిపక్ష నాయకుడు. అయినా వీళ్ళిద్దరి మధ్యా సుహృద్భావ పూర్వకంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ ఉండేవి.

**టంగుటూరి ప్రకాశం** : వీరేశలింగం తరవాతి తరంవాడైనా వీరేశలింగంపట్ల గురుత్వం ఉన్నవాడు. తన తమ్ముడు టంగుటూరు శ్రీరాములుకీ, వీరేశలింగానికీ మధ్య కలిగిన వివాదంలో తమ్ముడి తరపున లాయరుగా, వీరేశలింగాన్ని పెద్దాపురం మున్సబు కోర్టులో 5 రోజులు క్రాస్ ఎగ్జామిన్ చేశాడు. బారిస్టరు పరీక్ష చదువుకు సీమ ప్రయాణం చేసినందుకు బహిష్కార పత్రిక పంపుతామని స్వాములవారు బెదిరిస్తే జంకవద్దని వీరేశలింగం వచ్చి ప్రకాశానికి ధైర్యం చెప్పాడు. ప్రకాశం లండన్‌లో ఉన్నప్పుడు వివేకవర్ధిని కత్తిరింపులు వీరేశలింగం ప్రకాశానికి పంపించాడు.

**చిర్రావూరి యజ్ఞన్నశాస్త్రి** : రాజమండ్రిలో లాయరు. వీరేశలింగం సంఘ సంస్కరణ కృషిలో రాజమండ్రిలో ఎంతో బాసటగా ఉండేవాడు.

**కౌమర్రాజు లక్ష్మణరావు** : వీరేశలింగం తరువాత తరంవాడే అయినా, ఆయనచేత కవుల చరిత్రను సంస్కరింపించి ముద్రింప చేసినవాడు. విజ్ఞాన చంద్రికా మండలి పక్షాన వీరేశలింగం స్వీయచరిత్రను మొట్టమొదటిసారి అచ్చువేసినవాడు. వీరేశలింగం స్వీయ చరిత్ర పూర్తి చేయటానికి కారకుడు.

**బయపూనెడి వెంకటజోగయ్య** : రాజమండ్రిలో సిరస్తదారు ఉద్యోగంలో ఉండేవాడు. వివేకవర్ధని స్థాపించిన తొలినాళ్ళలో కొక్కొండకు ప్రతిగా వీరేశలింగం స్థాపించిన గుణాగణ ప్రదర్శనీ సమాజ సభ్యుడు. వీరేశలింగం అనుచరుడు. వివేకవర్ధనిలో కొక్కొండ విగ్రహ తంత్రాన్ని విమర్శించినవాడు.

**సమర్తి రంగయ్య సెట్టి** : మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో గణితశాస్త్రాచార్యుడు. దేశభాషా పర్యవేక్షకాధికారి. వీరేశలింగాన్ని నవల వ్రాయమని మొట్టమొదటిసారిగా ప్రోత్సహించిన

వాడు. గ్రంథ రచన విషయికంగా వీరేశలింగాన్ని చాలా ప్రోత్సహించినవాడు. 1912 లో జరిగిన రైలు ప్రమాదంలో మరణించాడు.

**ధర్మవరం కృష్ణమాచార్యులు** : చిత్ర నళీయాది సుప్రసిద్ధ నాటక కర్త.

**కనపర్తి శ్రీరాములు** : వీరేశలింగం శిష్యుడు. తరువాత తరంవాడు. రాజమండ్రిలో లాయరుగా పనిచేసేవాడు. హితకారిణీ సమాజ ధర్మకర్తృత్వ సంఘ సభ్యుడు.

**టంగుటూరి శ్రీరాములు** : వీరేశలింగం అనుచరుడు. కాని ఆయనతో విరోధపడినవాడు. వీరేశలింగంమీద దూషణ వాక్యాలు వ్రాసి, వృద్ధాప్యంలో ఆయనను కోర్టు చుట్టూ త్రిప్పినవాడు.

**నాళం కృష్ణారావు** : వీరేశలింగం అనుయాయిగానే, ఆరాధకుడుగానే ఉంటూ, ఆయన వ్యతిరేక పక్షంలో చేరిపోయినవాడు. కవి, గ్రంథకర్త.

**చిలకమర్తి లక్ష్మీనరసింహం** : సాహిత్య, సంఘ సంస్కరణ రంగాలలో వీరేశలింగానికి అనుయాయి. వీరేశలింగం మహాశయుని శిష్య పరమాణువునని చెప్పుకొన్నవాడు. వీరేశలింగం చివరి దశలో ఆయనతో కలిసి పనిచేసినవాడు.

**పూండ్ల రామకృష్ణయ్య** : నెల్లూరునుంచి వెలువడుతుండే అముద్రిత గ్రంథ చింతామణి అనే సాహిత్య మాసపత్రిక సంపాదకుడు. ఈయన వేదం వెంకట్రాయశాస్త్రి గారి అభిమాని అయినా, వీరేశలింగంపట్ల మిత్రభావమూ, గౌరవమూ ప్రదర్శించినవాడు. వీరేశలింగం వ్రాసిన గ్రంథాలు అముద్రిత చింతామణిలో సమీక్షితాలైనవి.

**రాయసం వెంకట శివుడు** : స్త్రీ విద్యాభిమాని. స్త్రీ విద్యను, స్త్రీల మానసిక వికాసాన్ని, ఉన్నతినీ కాంక్షించి "తెలుగు జనానా" అనే పత్రికను కొన్నాళ్ళు నడిపాడు. ఈ పత్రికకు వీరేశలింగంగారి సహాయ సహకారాలుండేవి. పర్లాకిమిడి కాలేజీకి, నెల్లూరులో వెంకటగిరి రాజాగారి కాలేజికి ప్రిన్సిపాలుగా ఈయన పనిచేశాడు. వీరేశలింగ స్మృతి అనే గ్రంథం వ్రాశాడు. వీరేశలింగం సన్నిహిత అనుచరులలో ఈయన ఒకడు.

**ఉన్నవ లక్ష్మీనారాయణ** : వీరేశలింగం తరవాత తరంవాడు. వీరేశలింగం స్థాపించిన హితకారిణీ బాలికా పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా కొన్నాళ్ళుండి, అభిప్రాయభేదం వచ్చి, మళ్ళా గుంటూరు చేరి, శారదా నికేతనం స్థాపించి, స్త్రీ జన సంక్షేమం నిమిత్తం పాటుపడినవాడు. వీరేశలింగంపట్ల భక్తి ప్రపత్తులున్నవాడు.



# అనుబంధం-3

# వీరేశలింగం

*(వీరేశలింగం కీర్తిశేషులైనపుడు రామలింగారెడ్డిగారి సానుతాప ప్రకటననుంచి ఈ భాగం గ్రహించడం జరిగింది. ఇది 1919 జూన్ 21వ తేదీన ఆంధ్రపత్రికలో ప్రచురితము.)*

"నా విద్యార్థి దశనుండి పంతులుగారిని బాగుగా నెరుగుదును. మొట్టమొదట వారిని 1870 సం॥న కలిసికొంటిని. నేననుకున్న దానికంటెను గొప్ప మహత్తు ఆయన యొద్ద యున్నదని గుర్తించితిని. వాఙ్మయ సంఘ సంస్కరణములపట్ల ఆయనయెడ నాకెంతయో గురుభావము కలిగినది. శాస్త్ర కర్మల ప్రకారము పరశువాకమునందు జరుపబడిన వితంతూద్వాహము నేను కన్నులార చూచితిని. చెన్నపురియందలి ప్రముఖులనేకులు ఆ వివాహమునకు వచ్చి యుండిరి. వివాహమైన తదనంతరము మహోత్సవమును జూచుటకు వచ్చిన అతిథులందరిని పంతులుగారు భోజనమునకు ఆహ్వానము చేసిరి. అతిథులందరు నేవో కొన్ని కారణములను చెప్పి యొకరివెంటనొకరు వెళ్ళుట జూడ నా కెంతయో ఆశ్చర్యమైనది. ఒకరు తామానాడు ఉపోషముంటిమనిరి. ఆ మహోత్సవ కాలమున దేవాలయమునుండి ప్రసాదమును మాత్రము తెప్పించుకొని భుజించిన బాగుండునని మరొక సంస్కర్త చెప్పెను. ఇంకొకరు తమకు కడుపు నొప్పిగ నున్నదనిరి. వారి ప్రవర్తననుబట్టి చూచిన వారక్కడనే యుండిన వారికి తప్పక యేదో యొక్క వ్యాధి రాగలదని నేను తలంచితిని. చదువుకొన్న మనుష్యులనేకులు సభావేదికల మీదనెక్కి యుత్సాహమును చూపువారేకాని పని చేయవలసినపుడు మాత్రము ముందునకు రారని తమకు కలిగిన అనుభవములను అప్పుడప్పుడు చెప్పుచుండెడివారు.

శ్రీయుత ఎన్...గారు వితంతువగు తమ మేనకోడలు పంతులుగారిని శరణుజొచ్చి వివాహమాడినంతవరకు పంతులుగారికి తోడునీడగనే యుండినారు. పిమ్మట పంతులు గారితో జగడమాడి, పంతులుగారిని విడిచిపోయినారు. ఇంకొక సంస్కర్తకు అంతర్జాతీయ వివాహములపట్ల సానుభూతి అపరిమితముగా కలదుకాని, తన కుమార్తె జాతకమునకు సరిపోవు కుర్రవాడు స్వజాతిలో తప్ప మరెచ్చటను ఆయనకు దొరకలేదు.

యువకులలో నెక్కువ యుత్సాహవంతులు, కార్యశూరులునగు బాపయ్యగారు మాత్రము పట్టపరీక్షలో నారితేరిన వారైనను స్వలాభమును గమనింపక పంతులుగారి కార్యసేవకు తోడ్పడి, వారికెంతయు సహాయము చేసిరి. కాని దైవము బాపయ్యగారు ఆంధ్రదేశమునకు నిరంతరము సేవచేయుటకు ఈ లోకమున నుంచక చిన్ననాటనే తీసికొనిపోయినది.

1909 సం॥న వేసంగి శెలవులలో విశ్రాంతికిగాను పంతులుగారు బెంగుళూరునకు వచ్చిరి. అప్పుడు మాలేశ్వరము నివాసులగు బాయన్నగారికిని పంతులుగారికిని గలిగిన

పరిచయమును నేనెన్నటికి మరువజాలను. కీర్తిశేషులగు నా మిత్రులు ఎం.జి.గరుడాచారి గారు, వారి సతీతిలకము నా గృహమున పంతులుగారిని కలుసుకొని అనుభవించిన ఆనందమును వర్ణింపనలవికాదు. 1912 సం॥న పంతులుగారు మైసూరునందు నా అతిథులుగా నుండిరి. అప్పుడు అదృష్టవశమున స్త్రీ విద్యాభివృద్ధిగా నెంతయో పనిచేయుచున్న నరసింహయ్యగారిని పంతులుగారు కలిసికొనిరి. పంతులుగారు తమరి నితరులు వృద్ధులని పిలచిన సహింపజాలరు. తామింకను పిల్లవారనే పిలవబడవలయునని వారి యాశ. తాము చదరంగము నుత్సాహముతో నాడగలమనియు, తినుబండారములను ఇంకను తినుట కెంతయు కుతూహలము గలదనియు వారు చెప్పుచుండువారు. చదరంగము పిల్లవాండ్ర ఆట కాజాలదు. తినుబండారములమీద నాకెంతయు పక్షపాతము. ప్రతిదినము సాయంకాలపు భోజనమైన తదనంతరము పంతులుగారు తమ జీవితమున అనుభవించిన కష్టసుఖములను నాకు వివరించుచుండెడివారు. ఇవన్నియు వారి స్వీయచరిత్రమున నుదాహరింపబడినందున వానినిచ్చట నుదాహరించుట అప్రస్తుత మగును. చదరంగమాడుటలో నాకు సామర్థ్యమున్నను సరకుగొనక పంతులుగారు నన్నోడించుటకు సదుపాయములు కల్పించుచుండెడివాడను. సంగీతము పాడగలనని వారి కెంతయు నుత్సాహము గలదు. ఈ విషయమున వారు వ్రాసిన మొదటి వ్యాసమైన తదనంతరము సంగీత విషయమున వారితో చర్చించుటయే మానుకొనినాను. నాచన సోమనాథుని గురించి పంతులుగారెల్లప్పుడు ప్రశంసించుచుండువారు. నాచన సోముని కవితా సామర్థ్యమును గురించి మాకెల్లప్పుడు చర్చ జరుగుచుండెడిది. నేను వ్రాసిన కవిత్వ తత్త్వ విచారమను గ్రంథము నాయన యెల్లప్పుడు కొనియాడుచుండెడివారు. అచ్చు తప్పులను దిద్దుటలో పంతులుగారంతటి అసమాన ప్రజ్ఞలుండుట దుర్లభము. నా గ్రంథము ముద్రణమునుండి వెలువడక ముందు అచ్చు ప్రతిని సవరణలకొరకు పంతులుగారికి పంపితిని. సవరణలుచేసి పంపుటకు బదులుగా గ్రంథముననున్న అచ్చుతప్పులన్నిటిని దిద్ది నాకు బంపిరి. ఆంధ్రకవి జీవితముల విషయమున మాకిరువురికిని యెంతయో చర్చ జరిగినది. కవి జీవితములను సంపాదించుటకుగాను వారు పడిన శ్రమ, చేసిన పరిశ్రమ వర్ణింప నశక్యము.

ఆంధ్ర వాఙ్మయమున పంతులుగారు ప్రఖ్యాత గ్రంథకర్తలలో నొకరని చెప్పవచ్చును. తాము వ్రాసిన పుస్తకముల వలన జీవితమును గడిపిన వారిలో పంతులుగారొక్కరే మనలో కనపడుచున్నారు. పంతులుగారికి ప్రఖ్యాతులైన వాల్టేరుతో వాఙ్మయమున సమాన స్థానము నీయవచ్చును. ఆంధ్రమునగల హాస్య ప్రబంధములకు పంతులుగారే మూల కారకులు.

వాఙ్మయము పంతులుగారి సేవా వ్రతమునకు ఆయుధమువలె పనిచేయగలిగినది. ప్రఖ్యాత గ్రీకు గ్రంథకర్తలగు హెయినుగారు తన సమాధిమీద ఆయుధము నుంచగోరెను. పంతులుగారి స్మరణ చిహ్న గౌరవార్థకముగా వారి సమాధిమీద అయుధము...

విశ్వాసమే సేవానిరతికి ఎంతయో సహాయభూతమయినదని పంతులుగారు నాతో నొకసారి చెప్పిరి. భావి ఫలాపేక్ష ఆయన కేమాత్రమును లేదు. సాహసముతో గూడిన

యుద్యమములకు సాహసమగు విశ్వాసమే అవసరమని పంతులుగారి యభిప్రాయము. పంతులుగారికి తమ దేశీయులమీదను ముఖ్యముగ దేశీయురాండ్రగు నారీమణుల పట్లను అమిత విశ్వాసము గలదు.

వీరేశలింగము పంతులుగారివంటి దేవతలను భారతదేశమెప్పుడు మరచిపోయిన అప్పుడు మనకు దుర్దశ సంప్రాప్తమైనదనియె చెప్పవచ్చును. పంతులుగారివంటి ధైర్యము, ఉత్సాహము, కార్యశూరత మన దేశీయులలో నెప్పుడు నాటగలమో, అప్పుడే పంతులుగారి చిహ్నమును స్మరింపగలిగిన వారమగుదుమని నా నిశ్చితాభిప్రాయం.

-డా॥ కట్టమంచి రామలింగారెడ్డి

## మీరు చదివారా?
## మహాకవి గురజాడ అప్పారావు,
## సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగం గార్ల రచనలు

| | | | రూ. |
|---|---|---|---|
| 1. | కథానికలు | - గురజాడ అప్పారావు | 40 |
| 2. | కవితల సంపుటం | - గురజాడ అప్పారావు | 75 |
| 3. | ముత్యాల సరాలు | - గురజాడ అప్పారావు | 25 |
| 4. | కన్యాశుల్కం (మలికూర్పు) | - గురజాడ అప్పారావు | 90 |
| 5. | రాజశేఖర చరిత్రము | - కందుకూరి వీరేశలింగం | 60 |
| 6. | ఆంధ్రకవుల చరిత్రము | - కందుకూరి వీరేశలింగం | 450 |
| | (238-పూర్వ, మధ్య, ఆధునిక కవుల చరిత్ర) | | |